# అవధూత వాణి

ప్రథమ భాగము



ప్రకాశకులు :
సాధన గ్రంథమండలి, తెనాలి.

"శ్రీరామరక్ష—సర్వజగద్రక్ష"

# అవధూత వాణి

ప్రథమ భాగము

అవధూతేంద్రసరస్వతీస్వామి

సంకలనము :

బులుసు సూర్యప్రకాశశాస్త్రి



ప్రకాశకులు :

సాధన గ్రంథ మండలి, తెనాలి.

# ముందలి మాట

హరేర్నామ హరేర్నామ హరేర్నామైవ కేవలం।
కలౌనాస్త్యేవ నాస్త్యేవ నాస్త్యేవ గతిరన్యథా॥

యుగానుసారంగా భగవంతుడు లోకక్షేమం కొరకు మహాపురుషులను అవతరింప జేయుచుండును. అట్టి మహనీయులవలన లోకమునకు మహోపకారం జరుగును. తద్వారా ప్రజలు తమ జన్మచరితార్థమును పొందుదురు.

శ్రీ అవధూతేంద్ర సరస్వతీ స్వామివారు పై జెప్పిన మహాపురుషులకోవకు జెందినవారు. శ్రీవారు ఎందుకు అవతరించిరో అవతార ప్రయోజనము సాధించి-కలిలో భగవన్నామము కంటె పాపములనుండి విముక్తులై తరించుటకు వేరు మార్గము లేదని వేదశాస్త్ర పురాణాదులలో ప్రమాణములతో దేశమెల్ల, వాడవాడల ఎలుగెత్తిచాటి, భగవన్నామ పతాకను నలుదిశల ప్రతిష్ఠించి అవతారము చాలించిరి.

జీవించినంతకాలము శ్రీవారికి భగవన్నామమె ఆహారము. జాగ్రత్స్వప్నసుషుప్తులలో నామస్మరణమె. నోరువిప్పిన-ఇతరులతో సంభాషణ భగవన్నామముతోనే జరిగెడిది.

శ్రీస్వామివారు సంకీర్తన సమయమున భక్తుల సమావేశమున చెప్పినవి శ్రీవారు డైరీలలో వ్రాసుకున్న వాని సంకలనమే ఈ "అవధూత వాణి"గా వెలువరించుచున్నాము.

శ్రీ స్వామివారు భక్తులకు వ్రాసినలేఖలు చాల వరకు సేకరించితిమి. ఈవర్ధంతికి "అవధూత లేఖలు" ప్రకటించి భక్తుల కర కమలములందు ఉంచవలెనని యత్నించితిమి. తగిన ఆర్థిక సంపత్తిలేమిచే ప్రచురించలేకపోతిమి. అచిరకాలమున అవధూతలేఖలు ప్రచురించు యత్నములో నుంటిమి. ఈ గ్రంథముద్రణకు ఆర్థికసహాయము చేసిన భక్తులకు భగవంతుడు ఆయురారోగ్య ఐశ్వర్యములు, భగవన్నామానురక్తియు నిచ్చుగాక.

తెనాలి
నలవైశాఖము
1976

ఇట్లు
బులుసు సూర్యప్రకాశ శాస్త్రి
వ్యవస్థాపకులు : సాధన గ్రంథమండలి.

శ్రీరామ జయ రామ జయ జయ రామ



# "అవధూత వాణి"

హరిగోవింద !................జయగోవింద !

వాసుదేవ !

ఈసారి గెలిచే గెలుపే గెలుపు. ఈసారి ఓడిపోవుటమే ఓడిపోవటం. అంతే !....మనుష్య యోనిలోనే గెలవటమూ.... ఓడటమూ. పశుయోనులలో గెలవటమూ లేదు....ఓడటమూ లేదు. అక్కడ మజా అనుభవించటమే. అక్కడ రామ భజన చేయవక్కర లేదు. ఇక్కడ రామ భజన చెయ్యకపోతే మళ్ళీ ఆ కోటిలోకి చేరుతారుట ...వాసుదేవ !

ఏకోటిలోకి ? ....పశుయోనిలో పుడతారుట ! ....

కాని రామ భజన చెయ్యని వాడిని "పశువు" అంటేమాత్రం పశువుకి కోపం వస్తుందట. మనుష్యుడై పుట్టి "రామ" అనలేక పోతే మాతోటి పోలుస్తారేమిటి ? మాకంటేకూడా అధముడు అని చెప్పి. అంత కోపం వస్తుందట పశువుతో పోలిస్తే. రామనామం చేయనటువంటి వాడిని....వాసుదేవ !

అందుకని అవికూడా సహించలేవు...."భగద్విముఖుడైనటు వంటి వాడిని మాతోటి పోలుస్తానికి వీలులేదు. వాడికి యోగ్యత ఉండికూడా "రామ" అని అనలేక పోతున్నాడు కనుక మాకంటే కూడా అధముడు" అని చెప్పి అవ్వి అనుకుంటాయ్యిట. వాసుదేవ! ....వాసుదేవ !....వాసుదేవ !

భక్తవత్సల భగవాన్ కీ జై
రామ నామ మహరాజ్ కీ జై

అందుకనే ఈసారి గెలిచే గెలుపే గెలుపు, అంటే....బాగా పంటలు పండించుకుంటేనా ?....ప్రమోషనులు వస్తేనా ?....

ప్రమోషను కోసమే పాటు పడాలి. ఏం ప్రమోషను ?....

అథవా మళ్ళీ పుడితే చచ్చి....మళ్ళీ రామ నామము చేసే టటువంటి ప్రమోషనే రావాలి. వాసుదేవ ! నిజమైనటువంటి ప్రమోషన్ అది....

మళ్ళీ ఒకవేళ చచ్చిపోయినట్టయితే....మళ్ళీ పుడితే.... వాసుదేవా ! మళ్ళీ యిటువంట....అఖండంగా నోటితోటి....కాళ్ళ తోటి....ఈ కళ్ళతోటి....ఈ సకలేంద్రియాలతోటి రామరసాన్ని జుర్రుకోటానికే మళ్ళీ జన్మమెత్తాలి. అదే ప్రమోషన్ అంటే!.... వాసుదేవ !....

అదే మహాత్ములంతా కోరుకుంటూ వుంటారు.... యేమని?
.... "పోనీలే !....ఈ జన్మ రాకపోయినాసరే !....పురుగై పుట్టినా సరే !....పుట్టై పుట్టినా సరే !....గోవింద !....వాసుదేవ !.... నా మనస్సు నీయందు లగ్నమైయుంటే చాలు" అని. అటువంటి వారికి మళ్ళీ ఆ యోనియెందుకు వస్తుంది? వాళ్ళు అలా కోరుకోవటంలో చమత్కారంవుంది.... "నిన్ను స్మరిస్తేనేచాలు, ఆయోనులు రావటానికి వీలు లేదు....అసలు యోనన్న మాటే లేకుండా చేస్తావు.... వాసుదేవ ! నీవు" అని. వారినిష్ఠ వారికి బాగా తెలుసు.

రామనామం కూర్చున్నా, లేచినా, తింటున్నా, తిరుగుతున్నప్పటికీకూడా వాసుదేవ !....యెప్పుడూ నోట పట్టివున్నట్టయితేనే "అబ్ కేజీత్ జీత్ హై"అంటే యీసారిగెలుపే గెలుపవుతుంది.

ఈసారిఓడేదా !....మళ్ళీయేమైపోతాడు?....తిండో, కంటో కూచుంటాడు! యేమయి?....పశువై !....వాసుదేవ!...."ఎంతభయంకరమైన శిక్షండీ!"....

ఏమోమాకేంతెలుసు? .... భగవానుదేచెప్పేడు. నాకువిముఖుడైతే మాత్రం ఆవిధంగా అయిపోతాడని....

వాసుదేవ!....వాసుదేవ!....వాసుదేవ!.

జైభక్తవత్సలభగవాన్‌కీ....జై

రామనామమహరాజ్‌కీ....జై

హరనమః పార్వతీపతయే

హరహరమహాదేవ్.

— అవధూతేంద్రసరస్వతి

# అవధూతాష్టకమ్

శ్లో॥ శ్రీవిష్ణుచరణోద్భాసి హృత్కుశేశయసుందరం,
వందే త్వా మవధూతేంద్ర మాంధ్రగౌరాంగరూపిణమ్. ౧

శ్లో॥ తృణీభూతం జగద్యస్య మేరుభూతం హి కీర్తనం,
వందే త్వా మవధూతేంద్ర మాంధ్రగౌరాంగరూపిణమ్. ౨

శ్లో॥ నామైవ జీవనం యస్య నామైవ పరమం ధనం,
వందే త్వా మవధూతేంద్ర మాంధ్రగౌరాంగరూపిణమ్. ౩

శ్లో॥ కోవిదం సర్వశాస్త్రేషు కోవిదం విష్ణుకీర్తనే,
వందే త్వా మవధూతేంద్ర మాంధ్రగౌరాంగరూపిణమ్. ౪

శ్లో॥ తీర్థీభూతం మహాత్మానం తీర్థసేవన తత్పరం,
వందే త్వా మవధూతేంద్ర మాంధ్రగౌరాంగరూపిణమ్. ౫

శ్లో॥ భాసయంతం హరేర్నామ సర్వవేదోపరిస్థితం,
వందే త్వా మవధూతేంద్ర మాంధ్రగౌరాంగరూపిణమ్. ౬

శ్లో॥ యస్య దర్శనమాత్రేణ నాస్తికోప్యాస్తికో భవేత్,
వందే త్వా మవధూతేంద్ర మాంధ్రగౌరాంగరూపిణమ్. ౭

శ్లో॥ సంకీర్తనమహాచార్య మాంధ్ర్యాం భక్తిప్రవర్ధకమ్,
వందే త్వా మవధూతేంద్ర మాంధ్రగౌరాంగరూపిణమ్. ౮

శ్లో॥ అష్టకం హ్యవధూతస్య యః పఠేత్ శ్రుణుయా దపి,
అభక్తో భక్తి మాప్నోతి భక్తో విష్ణోరనుగ్రహమ్. ౯

—బు. సూ. శాస్త్రి.

“ శ్రీరామ రక్ష - సర్వ జగద్రక్ష”
హరేరామ హరేరామ రామరామ హరేహరే ।
హరేకృష్ణ హరేకృష్ణ కృష్ణకృష్ణ హరేహరే ।
శ్రీరామ జయరామ జయజయ రామ

# అవధూత వాణి

## భగవత్ప్రేమ మరియు భగవంతుని ప్రేమించుట.

ప్రియ! వత్స! నా యొక్క గౌరవాన్ని చూచి నీవు భయముతో కూడిన ఆదరముతో నన్ను చూడకుము. ఇది నాకు ప్రియముగాదు. నీవు నాయందు స్వతంత్ర మైన ప్రేమతో యుండవలయును. నేను పూర్ణకాముడ నైనప్పటికీ నాకేమియు అపేక్షితమైనది లేదు. అయినప్ప టికీ నా ప్రేమ భక్తుడు తనకుగల నిశ్శంకమైన ప్రేమతో నన్ను చూచునో, లేక నాతో ప్రేమాలాప మొనరిం చునో, అప్పుడు వానియొక్క వ్యవహారము నాకు నిత్య నూతనముగా పరమప్రియముగా తోచును. నేను నిత్య ముక్తుడనైనప్పటికీ నాయందు ప్రేమగల భక్తులద్వారా

ప్రేమపాశములలో బంధింపబడి పోయినాను. అపరాజితుడనైనప్పటికీ వానివలన పరాజితుడనైతిని. మరియు స్వాధీనుడనైనప్పటికి కూడా వానికి అధీనుడుగా నైతిని. ఎవరు సంసారసంబంధ బాంధవ్యముల యొక్క స్నేహమును వదలి నిశ్శంకతో నన్ను ప్రేమించుచుందురో వానికి నే నొక్కడనే, నాకు వాడొక్కడే, -ఇంకొకడు వానికి ప్రియుడు లేడు. మరొకడు నాకు ప్రియుడు లేడు. ఇది ప్రహ్లాదునిప్రతి భగవద్వాణి.

° ° °

> సర్వధర్మాన్ పరిత్యజ్య
> మా మేకం శరణం వ్రజ
> అహం త్వా సర్వపాపేభ్యో
> మోక్షయిష్యామి మా శుచః॥

అర్జున! నీయొక్క ధర్మము లన్నింటిని వదలి పెట్టుము. కేవలం నన్నే శరణుపొందుము. అన్ని పాపములనుండి నేను నిన్ను వదలించెదను చింతింపకుము

ఇక్కడ భక్తియొక్క స్వరూపము ప్రకటితమయింది. పుణ్యాభిమానమును వదలి భగవత్ శరణా

గతుడ వగుము. అతడు సమస్తపాపములనుండి విముక్తుని జేయును అని విశ్వసింపుము.

పాపం వుందనుటకు గుర్తు యేమిటి ?

మనస్సులో వాసనలుండుటయే పాపం వుందనుటకు గుర్తు. వాసనలు పాపబీజములు. వాసనా బీజములున్న వాడు ఎప్పుడయినా పాప మొనరించవచ్చును. భవిష్యత్తులో పాపమొనరించుటకు సమయం, సంబంధం-ఎవడు వర్తమానంలో పాపకర్మమునందు లగ్నమయ్యేనో మాటిమాటికి వాడు దుఃఖించును. వాడు భూతకాలములో పాపకర్మయందున్న వాడే.

భగవానువాచ :—

పాపమునుండి నేను నిన్ను విడిపించెదను. అవిద్యా పర్యంత సర్వదుఃఖములనుండి పాపముయొక్క సమస్త పరిణామములనుండి నేను నిన్ను ముక్తుణ్ణి ఒనరించెదను. నీవు శోకింపకుము.

భక్తిలో యింత సామర్థ్యమున్నది భగవంతునిలో భక్తి వానియందు ప్రేమ గలిగితే వర్తమానంలో పాపములు జరుగనే జరుగవు. కానవాకయితే ఇంక

దుఃఖమొందులకు! ఈవిధంగా భక్తి భూతభవిష్యద్వర్త
మానము అను మూడువిధములైన పాపములనుండి విడ
లించును.

భగవంతుడు అగ్నితో సమానంగా అందరి దుఃఖ
మును దూరమొనరించును. అగ్ని సమీపమునందుండు
వానికి భయము శీతమును అగ్ని దూరమొనరించును.
అటులనే యెవడు పరమాత్మకు సమీపమున నుండునో
ఆయనను స్మరించునో అట్టివానియొక్క భయమును
దుఃఖమును దూరమొనరించును.

నాకు నీధర్మములు అవసరములేదు. వాటిని వదలి
నాయొక్క శరణు నొందుము. నీయొక్క బ్రహ్మచర్య
గృహస్థ వానప్రస్థ సన్యాసాది ధర్మములయొక్క ఆశ్ర
యమును వదలుము.

• • •

"ఏకం శరణం వ్రజ"

కేవలం శరణమొందుము. నేను నిన్ను సమస్త
పాపములు, దుఃఖములనుండి వదలించెదను.

ఆత్మ మరియు ధర్మము యెన్నడు కలియలేదు.

ఇవి కలసియున్నవని తలంచుట భ్రమ మాత్రమే. నేను ధన, పుత్ర, స్త్రీ, గృహ, యశస్సు అథవా దేహము గలవాడ నను అభిమానము వదలుము. ఇవి తమయందు లేవని ఎఱుంగుము. ఇవి తమయందు లేవని తెలిసికొను టయే వీటిని త్యజించుట.

ధనమునకు రెండర్థము లుండును. "ధ్రియతేతిధర్మః" మరియు "ధార్యతేతి ధర్మః" వేటిని ధారణ మొనరించు టకు మనము స్వతంత్రులమో, అట్టి సత్యము అహింసాది ధర్మములు తథా వర్ణాశ్రమ ధర్మములు. మరియు యేవి మనలను ధారణ మొనరించునో, ఏది మనయొక్క స్వభావమో. ఎటుల అగ్నియొక్క ఉష్ణత్వము మొద లగు రెండింటిని పరిత్యజించి- "పరిత్యజ్య, పరిత్యక్తేన అనబుధ్య" ఇవి మనయందు లేవని ఎరింగి "శరణమ్, అధిష్ఠానమ్" అధినామమును "వ్రజ జానీహి" అనుభ వించుము దీనివలన అవిద్యా పర్యంతమైన సమస్త పాప ములు దుఃఖములనుండి నీకు ముక్తి కలుగును.

• • •

"మన్మనా భవ"లో చింతనము - జ్ఞానము."
మరియు బుద్ధిని అర్పించమని భగవంతు డనెను.

సేవ :- భక్తి, మరియు మనస్సును అర్పించుము. ఇది "మద్భక్తః" యని చెప్పెను.

మద్యాజీ :- కర్మను అర్పించుటకు ఆదేశము. బుద్ధిని, బుద్ధియొక్క చింతనను - మనస్సుయొక్క సంకల్పములను-క్రియలను ఈ మూడింటిని నా కర్పించుమని భగవానుడనెను.

మాం నమస్కురు :- నాగురించి నీయొక్క అభిమానాన్ని వదలిపెట్టుము.

ప్రియోఽసి మే :- నాకు ప్రియుడవు, అతః ప్రతిజానే" ప్రతిజ్ఞ చేసెదను. సత్యం నిజంగా "మామేవైష్యసి" నన్నే పొందగలవు.

"ఆత్మే ఆత్మతో ఆత్మలో ఆత్మను చూచుచున్నది."

తనకు తనను అద్వితీయబ్రహ్మనని ఎరుంగకుండుటయే అజ్ఞానము. ఈ అజ్ఞానమును పూర్ణముగా నివృత్తి చేయు జ్ఞానమే సాక్షాత్సాధనము; ఇదే సంపూర్ణ సాధనలకు ఫలము. ఈ అజ్ఞానమును పోగొట్టుటకు స్వయంగా మరొక స్వతంత్రమైన వస్తువులేదు. ఆత్మకంటే అతిరిక్తంగా అజ్ఞాన నివృత్తికి ఒకస్థానం గానీ ఆకారంగానీ లేక కాలంగాని లేదు.

అజ్ఞానముయొక్క నివృత్తి అనగా ఆత్మ చైతన్య స్వరూపమైన బ్రహ్మ దీనిలో బంధనముక్తులకు యెట్టివిధమైన కలన లేనే లేదు.

బ్రహ్మమునకు జ్ఞేయతామూలక మగు విద్య మరియు అజ్ఞేయతామూలకమగు అవిద్యయు యున్నది. ఈభేదము కూడ అవిద్యలో కూర్చునే చేయబడుతుంది. స్వయం బ్రహ్మకుందు గాదు. అవిద్య నివృత్తైన మీదట వ్యావహారికము లేక పారమార్థికము ననూ భేదపరమార్థముమీద యెట్టి ప్రభావమును పడదు. "సర్వథా వర్తమానోఽపి" యొక్క అర్థమూ యిదియే.

అధ్యస్తుని యొక్క గుణదోష ప్రభావము లు అధిష్ఠానమునందు యేమాత్రము పడవు. అందు చేతనే భ్రాంతి అంతఃకరణమునందే. భ్రాంతియొక్క సంపూర్ణ ప్రభావ ముంటుంది. దీనివలన అధిష్ఠానస్వరూపమైన ఆత్మకు లాభ-నష్టములులేవు. ఈవిషయం శ్రుతి-స్మృతి శాస్త్రములు ఏవం బ్రహ్మసూత్రానుమోదితములై యున్నవి.

•  •  •

"సారమైన యీ మాటలయందు ధ్యానముంచుము.

1. ప్రకృతి-వికృతి, అథవా కారణ కార్యరూపమైన వ్యష్టి-సమష్టి ప్రపంచము లేక అనగా క్షేత్రం మీరు గాదు.

2. క్షేత్రజ్ఞుడు క్షేత్రముయొక్క అభిమాని వికారము సంస్కారము-ఆకార ప్రకారాదులయొక్క రూపముతో ప్రతీయమానమగు దృశ్యముయొక్క ధర్మిగాదు. పరిచ్ఛిన్నత్వము మరియు పూర్ణత్వము రెండునూ ఔపాధికములైనవే. వాస్తవికములు గావు.

3. ఉపాధి మరియు ఔపాధిక అధిష్ఠానం జ్ఞానమునందు మిథ్య మాత్రమే. ఉపాధికూడా వాస్తవంగాదు. భేదమాత్రంకూడా తన అత్యంతాభావంతో అధిష్ఠానమున భాసమానమగుటచే మిథ్యయై యున్నది.

4 భాసమానత్వం రెండువిధము లుంటుంది. ఒకటి ఖండితంగానూ, మరొకటి అఖండంగాను. మొదటిది బాధితము, రెండవది అబాధితము. బాధితమైనది మిథ్య-అబాధితమైనది ఆత్మా బ్రహ్మ. ఆత్మయే అద్వితీయమైన బ్రహ్మ ఇదే బంధమోక్షకల్పనలకు ప్రకాశకమై స్వయం ప్రకాశము అధిష్ఠానమగు బ్రహ్మాత్మ అయి యున్నది. "యే విదు ర్యాన్తి తే పరం"

● ● ●

జ్ఞానాగ్ని దగ్ధ కర్మాణమ్
త మాహుః పండితం బుధాః

జ్ఞానాగ్నివలన యెవనియొక్క కర్మలు భస్మమయి పోయినవో, ఎవనిలో కర్తననీ, భోక్తనని భ్రాంతి లేకుండ వున్నదో బుద్ధిమంతులు వానిని పండితుడంటారు.

"జ్ఞానపాండిత్యా ఎటువంటిది!"

దేనివలన సమదర్శి అయినాడో ఆ ఈ ఆత్మ అవ్యక్తము. అనగా ఇది స్థూల దేహము, స్థూలసృష్టిగాదు. స్థూలము లేక వ్యక్తముకంటే విలక్షణమైనది. అయితే సూక్ష్మమైనదా? కాదు.

"అచిన్త్యోఽయమ్"

ఇది అచిన్త్యమ్, అనగా సూక్ష్మదేహము సూక్ష్మ సృష్టియూగాదు. చింత్యం సూక్ష్మంకంటే విలక్షణమై యుంటుంది.

అయితే కారణదేహమై యున్నదా? అదియునూ కాదు.

"అవికారోఽయమ్"

ఇది వికారవంతమైంది గాదు. కారణదేహము కారణాత్మిక సృష్టియూ గూడ గాదు.

ఏది వికారమో అది కారణమవుతుంది, ఏది చిన్న్యమో అది సూక్ష్మమవుతుంది. వ్యక్తమగునది స్థూలమవుతుంది ఏది వ్యక్తమో అది స్థూలము

ఈ యాత్మ స్థూలసూక్ష్మకారణములగు యే ఉపాధితోనూ గ్రస్తము కాలేదు.

పాండిత్యం గలిగినపుడిది "నానుశోచతు మర్హసి"

"శోకానికి యే కారణము యుండియుండదు"

ఆత్మ అవిద్య, అవిద్యయొక్క కార్యరూపమైన క్షేత్రమునుండి విలక్షణమైనది.

• • •

"యస్మిన్ యదధ్యస్తం తస్మిన్ తత్
స్వాధిష్ఠానాత్ పృథ జ్ఞభవతి"

ఏ యధిష్ఠానమునందు మిథ్యావస్తువు ప్రతీత మవుచున్నదో అది దానికంటే భిన్నముగాదు. దీని యర్థమేమనగ ప్రపంచము బ్రహ్మాతిరిక్తముగా కించిత్ గూడా లేదు.

దేశ, కాల, వస్తు పరిచ్ఛేదముతో శూన్యంగా దేనియందు యీ ప్రపంచము ప్రతీత మవుచున్నదో దానికంటే భిన్నముగాదు.

నీయొక్క బుద్ధి నిశ్చయించినా, నిశ్చయించక పోయినా నీవు బ్రహ్మవే. బుద్ధి నీయందు కల్పితం.

బ్రహ్మయందు దేశకాలద్రవ్యాదులన్నియు భావాత్మకములయి యున్నవి. బ్రహ్మయే ముందు, వెనుక, బయట, లోపల, స్వ లేక అన్య రూపంలో ప్రపంచముయొక్క అస్తిత్వము లేదు.

• • •

బ్రహ్మ దేశముయొక్క అధిష్ఠానరూపంతో పూర్ణముగా యున్నది.

కాలంయొక్క అధిష్ఠానరూపంతో నిత్యము అతః అవినాశియై యున్నది.

ప్రత్యేక బీజాత్మక సత్తాత్మక రూపమునకు అధిష్ఠానమగుటచే సంతానమై యున్నది.

• • •

"అట్టి బ్రహ్మయే నా ఆత్మ"

1) పరమాత్మ యీసమయంలో లేదు. అయితే అతడు యింతవరకు పుట్టనేలేదు. లేక పుట్టి పోయినాడు. కాని అలాకాదు. పరమాత్మ యీ సమయంలోనే వున్నాడు.
2) పరమాత్మ యిక్కడ లేకపోతే ఇంక ఎక్కడికయినా వెళ్లాడేమో? దేశపరిచ్ఛిన్నుడౌతాడు. కాని పరమాత్మ సర్వవ్యాపకుడు. అతః ఇక్కడే యున్నాడు.

3) పరమాత్మ యిక్కడ లేనిచో యీవస్తువు పరమాత్మ కంటే భిన్నమయినది. అయితే పరమాత్మ వ్యాపకుడు గాడు. కాని పరమాత్మ వ్యాపకుడు. అతః ఇది పరమాత్మయే - ఈవిధంగా పరమాత్మ ఇప్పుడే ఇక్కడే యీరూపంలోనే వున్నాడు. అయితే కనపించదేమి అతడు? ఎందుకు కనుపించడంటే? మనయొక్క దృష్టి ఇది, అది యని కల్పనలలో చిక్కుకొనియున్నది. ఇది అజ్ఞానకారణము. అందుచేత యేకొంచమయినా అజ్ఞాన నివృత్తికే సాధన మగును. అదే పరమాత్మ ప్రాప్తికిగూడా సాధన మవుతుంది. "అజ్ఞానకీ నివృత్తి కేవల జ్ఞానసే హోతీ హై".

• • •

"ఇచ్ఛా ద్వేషః సుఖం దుఃఖం"

ఇది సవికార క్షేత్రం. దీని భావన వలన నరకాను భవం కలుగుతుంది.

ఎప్పుడైతే వికారంతో యున్న క్షేత్రాన్ని అను సంధానం చెయ్యక నిర్వికారంలో అగ్రసరులమైతే అప్పుడు మనలో అమానిత్వ, అదంభిత్వాదులు వచ్చును. కాని దీనివలన మనం పరమాత్మ స్వరూపజ్ఞానానికి అధికారుల మౌతాము. అవిద్యా నివృత్తి తత్వజ్ఞానంతో గలుగుతుంది. తత్వజ్ఞానం అనుభావ్యంగూడా గాదు.

• • •

"మ ద్భ క్తిః"

ఈ జ్ఞానానికి అధికారి యెవడు ? సద్భక్తః

ఈశ్వరుణ్ణి, సర్వజ్ఞుణ్ణి, పరమగురువుని అయిన నాలో సమర్పితమైన సర్వాత్మభావము — ఏదైనా చూస్తాడో, వింటాడో, ముట్టుకుంటాడో అది అంతయు భగవాన్ వాసుదేవుడే ! ఈ ప్రకారంగా యెవనికి గ్రహ విష్టముతో సమానంగా బుద్ధి గలిగినదో "వహ" మద్భక్తుడు.

శరీరాదులను మిథ్యయని తలచక సాధనను మిథ్య

యని వదలినవారు మాత్రము ఆత్మద్రోహు లౌదురు.

1) ఈశ్వరునియందు విశ్వాసముంచితే ఆచారద్రోషం నివర్తక మౌతుంది.

2) వాసనానివృత్తికొరకు ఈశ్వరభక్తి అవశ్యకము.

3) ఈశ్వరుని విశ్వాసముంటే సంసారికమైన యోగ క్షేమముల చింత తొలగిపోతుంది.

4) సంసారవివేకమే పరమార్థము. అట్టి వివేకం కావలసి వస్తే ఈశ్వరుణ్ణి విచారించుము.

● ● ●

"సకల మిద మహం చ వాసుదేవః"

ఎవ రేమన్నాసరే! ఏమనుభవించినాసరే! నీవు యితరుల చింత ఏలచేసెదవు ? అంతా వాసుదేవుడు. అట్టి బుద్ధికలిగితే, సంసారమునందు రాగద్వేషములు వదలిపోవును. పాపకర్మలు, వాసనలు వదలిపోయినవి. కర్తృత్వ భోక్తృత్వములు నివృత్తయినవి ఇదే భక్తి. ఇది అంత్యంలో పదార్థమును శోధించి. తత్త్వం పదార్థముల శోధించి రెంటియొక్క వుపాధిని నిరసించి ఏకత్వం జ్ఞానమును కలిగించును.

తనను తాను చంపుకొనకుండా యుండు వుపాయం, సర్వత్రి సమ నరూపంతో యుండు ఈశ్వరుని చూచుట (సమం).

సమం :- అందరియందు ఒకలా చూడు.

● ● ●

"అశరీరం శరీరేషు అనవస్థే ష్వవస్థితమ్"

శరీరం కల్పితం. అది కల్పితం. స్థావర జంగమాలన్నీ అనవస్థం. స్థితిహీనంగా యున్నవి. గాని అది అచలం స్థిరం.

ఆత్మఘాతకు డెవడు? ఈపరమాత్మను తెలియనివాడు.

● ●

"ఆత్మహింస అంటే"

జ్ఞానస్వరూప మగు తనను అజ్ఞాని ననుకొనుట ఆత్మహింస.

రాగ ద్వేషము లు కలిగియుండుట ఆత్మహింస.

పరిచ్ఛిన్ను డనుకొనుట ఆత్మహింస

చచ్చెద ననుకొనుట ఆత్మహింస

ఏది లేకున్నను ఆత్మ వుండనిది కాదు. ఆత్మను చంపువాడెవడును లేడు.

ఆత్మను బ్రహ్మ రూపంతో తెలిసికోవాలంటే అన్నింటినీ నిషేధించాల్సి వుంటుంది. విషయములు, ఇంద్రియములు, మనస్సు, బుద్ధి, వాసన, కర్తృత్వ-భోక్తృత్వ - సంసారిత్వ - పరిచ్ఛిన్నత్వ మొదలగు ప్రకృతి - ప్రాకృత సమస్త ప్రపంచమును నిషేధించుట అవసరము.

● ● ●

బ్రహ్మ అస్తి నాస్తి యని అంటారు గదా ! అయితే బ్రహ్మ లేనే లేడు.

దీనికి సమాధానము భాగవతపద్ధతిలో వ్యవహారంలో బ్రహ్మను చూపెట్టుతారు. ఎటుల భగవద్భక్తుడు కార్య కారణ రూపంతో సర్వత్రా భగవంతుణ్ణే చూస్తాడు. అదే సర్వత్ర భగవంతుని చూసే ప్రక్రియ.

ఆ భూషణముల ఆకృతి యేదైనాగాని అది అయితే స్వర్ణమే. ఉపయోగదృష్టిలో కంకణములు, హారనూపురములు వేరువేరుగా నున్నవి అటులనే పశు, పక్షి, మనుషులు వేరువేరుగా వున్నారు. మానవులలోనూ

స్త్రీ, పురుష, బాలకులు, వృద్ధులు యువకాది భేదము లున్నవి. ఒక్క శరీరంలోనే చేతులు, కాళ్లు, తల, కడుపు మొదలగు వేరువేరు అంగములున్నాయి. అయితే అన్నిటిలోనూ అవే పంచభూతములు. — ఒకటిగానే యున్నవి.

• • •

ఇయ మేవ పరాహాని, రుపసర్గోఽయ మేవ హి ।
అభాగ్యం పరమం చైతత్, వాసుదేవం నయ త్స్మరేత్.

మానవుడై జీవించుచు యెవడు వాసుదేవుణ్ని స్మరించడో, వాడు గొప్పనష్టమును పొందుచున్నాడు. గొప్ప ఉపద్రవము పాలగుచున్నాడు (సంపాదించుకుంటున్నాడు) వాడు పరమ అభాగ్యుడు.

యద్యప్యుపహరతః పాపై ర్మనసా త్య న్తముస్తరైః ।
తథాపి పంస్మరన్ విష్ణుం, స బాహ్యాభ్య న్తరః శుచిః ।

—గరుడపురాణము

అత్యన్త దుస్తరమైన మానసిక పాపములతో దూషితమైన హృదయముగలవాడైనప్పటికీ విష్ణుభగవానుణ్ని స్మరించినట్లయితే అతడులోపల. బయట పవిత్రుడౌతాడు. ఏమన హరిస్మరణవలన అన్ని పాపములు నశించిపోతాయి.

తులాపురుష దానము - అనగా పురుషుడిన్ని తూచిన స్వర్ణము - రాజసూయ-అశ్వమేధాది యజ్ఞములయొక్క ఫలము విష్ణుస్మరణ ఫలముతో తుల్యము గాజాలదు.

(బృ. నా. పు)

న్యూనాతిరిక్తతా సిద్ధా కలౌ వేదోక్త కర్మణామ్
హరిస్మరణ మేవాత్ర సంపూర్ణ ఫలదాయకమ్ ॥

కలియుగంలో వేదవిహితమైన కర్మానుష్ఠానములు సరిగా జరగవు-తక్కువ యెక్కువలుగా అవుతుంటాయి. అందుచేత ఫలప్రాప్తిలో సందేహా లుంటున్నాయి. కేవలం హరిస్మరణ సంపూర్ణఫలాన్ని ప్రసాదిస్తుంది. ఇందులో సందేహ మెంతమాత్రము లేదు.

వాగ్గద్గదా ద్రవతే యస్య చిత్తం రుదత్యభీక్ష్ణం
హసతి క్వచిచ్చ ।
విలజ్జ ఉద్గాయతి నృత్యతే చ మద్భక్తియుక్తో
భువనం పునాతి । భా. 11-14-24

కీర్తనచేయుచూ చేయుచూ యే భక్తునివాక్కు గద్గదమవుతో, నామస్మరణవలన యెవని చిత్తము ద్రవించుతో, ఎవడు భావావేశంలో క్షణక్షణం ఏడుస్తూ వుంటాడో, అప్పుడప్పుడు నవ్వుతూకూడా యుంటాడో,

లజ్జారహితుడై ఉచ్చస్వరంతో నామకీర్తన చేస్తాడో మరియు నృత్యంకూడా చేస్తాడో అటువంటి నాభక్తుడు సమస్తవిశ్వాన్ని పవిత్రం చేస్తాడు.

• • •

## అత్యుత్తమ ఫలప్రాప్తి

అసంగుడై నిస్సంకోచంగా చక్రపాణి భగవాన్ వాసుదేవుని కల్యాణకరములగు జన్మకర్మలను, ఆయా లీలలను పురస్కరించుకొని వుంచిన గిరిధారి వంశీవిహారీ మొదలగు ప్రశిద్ధనామాలను వినిపించుచూ తిరుగుచుండవలెను. "శృణ్వాన్ భద్రాణి" — "భాగ. 11 . 2 . 39.

దేహబుద్ధ్యాతు దాసోఽహం, జీవబుద్ధ్యా త్వదంశకః ।
ఆత్మబుద్ధ్యా త్వమేవాహ, మితి మే నిశ్చలా మతిః ।

నీవు భగవంతుని మార్గంమీద నడవదలిస్తే ఎవరైనా ధనికుడ్ని ధనంవలన నీకన్న గొప్పవాడని యెంచవలదు. ధనంవలన అతనిని గొప్పవాడనుకుంటె నీయొక్క బుద్ధికూడ ధనం సంపాదించాలనుకుంటుంది. ఎవరైనా భోగిని భోగకారణంచేత లేక ధర్మాత్ముణ్ణి ధర్మకారణంచేత గొప్పవారని ఎంచవలదు ఎవనిలో భగ

వంతుని భక్తియున్నదో అతనినే శ్రేష్ఠుడనుకో! అప్పుడే నీకు భక్తి పెరుగుతుంది.

• • •

మీయొక్క జీవితలక్ష్యం పారమార్థికమైతే మీరు భగవంతునితో యుండాలి. బ్రతుకు భగవంతునికోసం. మరణంకూడా భగవంతునికొరకే గావాలి. ప్రాణాన్ని భగవంతునిలో కలిపెయ్యి. అతడు వాటిని ఈదినం తీసుకుంటే ఏమీ నిష్ఠూరం పలకవద్దు. మనుష్యుడు ప్రతిక్షణం ఈశ్వరునియొక్క సంకేతాన్ని నిరీక్షిస్తూ యుండాలి.

—వి భూ. 124, 125 పేజి.

• • •

"బ్రహ్మానుభూతిద్వారానే ప్రపంచముయొక్క విధ్యాత్వము"—

వేదాంతసిద్ధాంతము హృదయంగమము చేసికొనుటకు స్థూల సూక్ష్మ కారణ శరీరములలోంచి అహంకారమును వేరు చేయుటయే ఆవశ్యకవిషయము. ఎంతవరకు జిజ్ఞాసువు తనశరీరంలో "నేను" వుంచుకొని జగత్సం

బంధమైన యదార్థమును గురించి ప్రయత్నించునో, అంతవరకు అది దేహంతో సమానంగా దృఢంగా కను పించును. అట్టి వాని యొక్క జ్ఞానము ప్రతీతి లేక మిథ్యాశబ్దముయొక్క ప్రయోగం విని పలికినట్లుండును. అట్టి శబ్దములవలన మృత్యుభయము అజ్ఞానము మరియు దుఃఖముయొక్క నివృత్తి కలగనే కలగదు. అతఏవ జిజ్ఞాసువుకు అన్నిటికంటె మొదటపని యేమన పరి చ్ఛిన్నంలో చిక్కుకున్న అహాన్ని వివేకం ద్వారా వేరు చేయుటయే.

ఏదైనా పరివర్తన శీలమైనది జడంగాగాని లేక దుఃఖదాయకంగా గాని తెలిసినట్లయితే అది పరిచ్ఛిన్న అహంయొక్క బలంమీదనే ఆధారపడి యున్నదని ధ్యానమానం దుంచుకొన యోగ్యమైనది. పరిచ్ఛిన్న త్వము దృశ్యము. మరి అహం సాక్షియై వుంది. అందు చేత వి వే క ము యొ క్క న్యూనాతిరిక్తముచేగా! రెండింటిని ఒకటియని తలంచుటలో కారణమేమియు లేదు. మొదట అనాత్మనుండి ఆత్మను విరిక్తం చేసు కొనియుండు. ఇది శ్రౌతసాంప్రదాయక్రమమై యున్నది. ఆ కారం సత్, అసత్ అని చెప్పుటకు వీలులేదు.

మారుతూవుంటుంది. అందు చేత సత్ గాదు. కనబడుటచే అసత్ గాదు.

చిత్ లో జడత్వంలేదు. ఆనందంలో భోగం లేదు. ఇది సచ్చిదానందాత్మయొక్క సహజస్వరూపం. అపరిణామం గలది. స్వయంప్రకాశమైంది-పరమానందము.

ఆత్మ ! మరణశీలం జడం దుఃఖం పరిచ్ఛిన్నత్వం వీటికంటె విలక్షణమైంది కూడాను. సంపూర్ణ దేశకాలములు వస్తువులకు ప్రకాశము నిచ్చునవి. స్వప్రకాశమే అయివుంది అందు చేత ఇది అపరిచ్ఛిన్నమై యుంది. ఇది శ్రౌతసాంప్రదాయముయొక్క రెండవ క్రమము ఈసిద్ధవస్తువుకే తెలియ చెప్పుటకు వేదాంతముల యొక్క సార్థకత అయి యున్నది. ఎవరు ఈక్రమాన్ని వదలి తమకు తోచినక్రమంతో బ్రహ్మాత్మైక్య బోధను పొందదలచుకున్నారో వారికి మాత్రం అది సంభవం గాదు.

ఎపుడు ఆత్మయొక్క బ్రహ్మరూపము అపరిచ్ఛిన్నత్వముగా అనుభవమునకు వచ్చునో అప్పుడు బ్రహ్మదృష్టి ద్వారానే సంపూర్ణదృశ్యము చూడబడుతుంది. దీని మూల్యాంకనం చేయబడుతుంది. బ్రహ్మకంటె

అతిరిక్తంగా రెండవది యేవస్తువైనా వున్నటులయితే ఏక విజ్ఞానంద్వారా సర్వవిజ్ఞానం కలుగుతుందను శ్రుతి యొక్క యీ ప్రతిజ్ఞ పూర్తికాకుండా యుండును. పొడుగు, వెడల్పు వయస్సు మరి బరువు భాసమానమైనప్పటికి బ్రహ్మదృష్టిద్వారా అకించిత్కరములు కేవలం ప్రతీతిమాత్రములు అయి యుండును.

వ్యవహారం కోసం వీటికిమిథ్య యను సంజ్ఞ కల్పింపబడింది వ్యవహారం కోసమే స్వయంసిద్ధమైన ఆత్మ పదార్థముయొక్క సంజ్ఞ బ్రహ్మమై యున్నది. తనను బ్రహ్మనని తెలిసికున్న పిదపనే ప్రపంచము యొక్క పృథక్‌గా యున్న అస్తిత్వము బాధితమై పోతుంది. పరిచ్ఛిన్నంలో "నేను" వుంటే ప్రపంచము యెప్పటికి మిథ్యగా (తోచదు) నే గాదు ఎప్పుడు నీ దేహము, అంతఃకరణము మరియు బీజము మిథ్యగా నగునో అప్పుడు ద్వైతదృశ్యం కేవలం ప్రతీతిమాత్రంగా యుంటుంది. అక్కడ అక్కడ విన్నటువంటి యుక్తులతో ద్వైతం యొక్క మిథ్యాత్వం సిద్ధించదు. అది స్వదృష్టిఅయి యున్నది. బ్రహ్మదృష్టిఅయి యున్నది. ద్వైతము మిథ్యయగుటకు అర్థమేమై యున్నదనగా స్వప్రకాశమైన,

అద్వితీయమైన ఆత్మబ్రహ్మయే అ అ న్య ము యొ క్క రూపంలో గాకుండానే అవిధంగా తోచుచున్నది. బ్రహ్మాతిరిక్త అన్యసత్తా లేనేలేదు.

ఏంజరుగుచున్నదనగా మనం దేహము దేహస్థ పరిచ్ఛిన్నమైన "నేను" ను ఉన్నదున్నట్లుగా చూస్తూ ప్రపంచము యొక్క రహస్యం తెలుసుకొనుటకు ప్రయాస పడుతూ యుంటాము. అందులో సామాన్యదృష్టిమాత్రం కలుగుతుంది. అయితే బ్రహ్మానుభూతి మాత్రం కలుగ యుంటుంది. పరిచ్ఛిన్నమైన "నేను" కు యిది తోస్తూ వుంటుంది. దానికి తనయొక్క జీవితం జ్ఞానసుఖముల కొరకు సమిష్టితో సంబంధం వుంచవలసి యుంటుంది. అనుకూలంతో రాగం, ప్రతికూలంతో ద్వేషం మరియు పునః పునః ప్రతీయమానమునందు మోహము కలుగు చుండును. ఈదోషములను వివేకవైరాగ్యముల ద్వారా నిరాకరించకుండ పరిచ్ఛిన్న దేహంతో "నేను" యొక్క పృథక్కరణ జరుగనేజరుగదు. శ్రౌతక్రమము యొక్క ప్రథమభూమిక సరిగా లభించక పోయినట్లయినే శంకరా చార్యులద్వారా ప్రపదిష్టమైన అద్వైతం ఆత్మబోధక విషయంలో ప్రాప్తించడం శక్యంగాదు.

అన్నిటికి సారాంశ మేమైయున్నదనగా "నేను"ను పరిచ్ఛిన్న మని అనుకొని ప్రపంచాన్ని మిథ్యగా తెలిసి కొనుట విపరీత జ్ఞానమైయున్నది. దేహాతిరిక్తమై ఆత్మను బ్రహ్మరూపంతో ఎరింగినమీదటే ప్రపంచ మిథ్యాత్వంగా ప్రతీతి యగుచుండును. వ్యావహారిక సత్తా ఏక మాత్ర బ్రహ్మజ్ఞానంద్వారానే బాధిత మవుతుంది, అన్యథాగాదు.

## "ఆత్మ"

ఆత్మ భోగములవలన, కర్మవలన వృద్ధిక్షయములు గలిగియుండదు.

మనస్సులోకి వచ్చి పోయిన వాటితో బ్రహ్మ జ్ఞానికి ఇసుమంతయు చింత యుండదు.

ఆత్మయందు పరోక్షాపరోక్షములయొక్క భేదము లేనేలేదు. గాన అనుభవస్వరూపమైన ఆత్మతోటి స్మృతికి యెట్టిసంబంధము లేదు. స్మృతి అనుభవమునకు సమకక్షయూ గాదు. సమకాలమూ గాదు.

ఈశ్వరుడుకూడా ఆత్మను పుట్టించలేడు, చంపలేడు పడవేయజాలడు, యెక్కడికైనా పంపజాలడు. ఏమన ఏది ఈశ్వరుని ఆత్మయో ఆదే ఆత్మ. అతః యెప్పుడు ఒక్క పర్యాయము ఆవరణభంగమైనదో అప్పుడు భ్రాంతి నివృత్తియైనది. అక్కడ తనస్వరూపము నిత్య శుద్ధబుద్ధ ముక్తమే కదా.

‘‘అహంచ, ఇదంచ, సర్వం నామదేవఏతః’’

అతః కార్యావస్థతోగూడ యీ జీవజగత్తులు తనకు కారణమైన ఈశ్వరునుండి అభిన్నమే ఆయి యున్నవి. వీరుపరమేశ్వరుణ్ణి జగత్తుకు అభిన్న నిమిత్తో పాదన కారణమని అంగీకరించెదరు. కాని కారణత్వ మును సత్యమని అంగీకరించెదరు.

‘‘అద్వైతవేదాంతులు’’

పరబ్రహ్మ పరమాత్మను జగత్తుకు పరిణామ అభిన్న నిమిత్తోపాదనమని గాక వివర్త అభిన్ననిమిత్తోపాదన కారణమని అంగీకరించెదరు. అర్థాత్ కార్యకారణ భావము పరబ్రహ్మ పరమాత్మతో వాస్తవికము గాదు.

కార్యకారణము లభేదమునుండి రహితమైనదే అద్వయతత్వమని పరమార్థము.

ఎవనిమతంలో అజుడు, అమరుడు, అజస్ర పరిపూర్ణుడు, అవినాశుడు ఏది స్వభావంతో అమృతమో అట్టి అద్వైతము జీవేశ్వర జగత్తులైనది. ముందున్నటువంటి అద్వైతం నశించి పోయింది. సృష్టి జరిగింది. భేదం యేర్పడింది. గనుక సృష్టిపోతే పునః అద్వైతం గలుగుతుంది. అటువంటి అద్వైతం నిజమైన అద్వైతం గాదు.

ఎవరియొక్క మతములో జన్మమరణము లున్నవో ఎవరియొక్క మతములో పరివర్తన మున్నదో వారి మతములో అద్వైతం సరిగాలేదు.

వ్యవహారిమైన సమాధి నిక్షేపములైన, లేక ఏకాగ్రత అయిన సృష్టి తోస్తోంది. భాసిస్తోంది. అయినాసరే అద్వైతం ఉన్నదున్నట్లుగానే వుంది. అదేనీవు.

ధర్మార్థ కామపురుషార్థులకు సృష్టిసత్యమే. సత్య జిజ్ఞాసువు పరమానందమును పొందగోరును. అతడు స్వయం సత్యరూపుడు. అట్టి మోక్షపురుషార్థి కొరకు

పరమాత్మయందు యీ సృష్టిలేదని శ్రుతి చెప్పినది. మరియు అది నిష్ప్రయోజన మనియు చెప్పినది.

*　　*　　*

పోమరితనమువదలి శ్రీరామనామము జపించుము. శ్రీరామునకు విముఖులైనవారు ఈ కలికాలమున వ్యర్థులై పోవుచున్నారు. మానవజన్మ ఎంత గొప్పదో తెలియుటలేదు. అంతయు కలిప్రభావము. కాని రామ నామముముందు కలి ఆట సాగదు. నమ్మండి.

రామనామముకన్న అన్యులెవరును నిజమైన మిత్రులుకారు. దేహపతనానంతరమున శ్రీరామనామము శ్రీరామధామమును సహితము పొందించును. మిత్రులు, బంధువులు, కుటుంబీకులు వీధివరకు ఊరి చివరివరకు, స్మశానమువరకే వత్తురు. శ్రీరామ నామమో శ్రీరామ ధామము చేర్పించువరకు రక్షగా వెంటనుండును. ఇది సత్యము.

ఏవిధముగానైనను, ఎప్పుడైనను, ఒక్కమారైనను భగవన్నామము ఉచ్చరించనివాని జన్మ వ్యర్థము.

వాని జీవితం అడవికాచిన వెన్నెలయే. వేలకొలది ధన మును చందాలుగా వసూలుచేస్తారు. గొప్పగా ఉత్స వాలు చేస్తామని కరపత్రాలు ప్రకటిస్తారు. కాని ఆకార్యక్రమములో రోజుకు 1 గంటఅయిన భగవన్నా మానికికూడ అవకాశ మిచ్చిన ఉత్సవాలు శోభిస్తాయి. చూచుటకు వచ్చినవారు తరిస్తారు. నాసంకీర్తన ఇటు వంటి కార్యక్రమములలో ఎందుకు పెడతారో తెలు సునా! జనాకర్షణ కొరకు, పోనిండు. ఆరూపంగా నైనను నామం పలుకుతారు. వినినను మంచిదే. వాసుదేవ! శ్రీరామ జయరామ జయజయరామ!

కలిలో ధర్మబుద్ధి క్షీణించింది. దైవభక్తి అసలే లేదు. దేవాలయములు జీర్ణ మగుచున్నవి. వానిని చూచువారే లేరు. మానవజన్మ ఎంత గొప్పదో ఎవ రును గ్రహించుటలేదు. కోట్లకొలది జన్మలు ఎత్తినగాని యీనరజన్మ రాదు. ఇట్టి అమూల్యమైన జన్మ వ్యర్థము చేయక, చచ్చి పురుగుగానో, పశుపక్షిగానో గాక, తుదకు మరల మానవుడుగా పుట్టుటకైనా యత్నించుట మనకర్తవ్యము. సంకీర్తనకు ఎక్కువ జనం రాలేదేం?

నిజమే! ఇది ఏమయినా హరికథ నాయనా! హరికథకు ప్రక్క-వాద్యములు సంగీతం హంగులు ఉంటాయి. సంకీర్తనకు అవేవియు నుండవు. రామరామ అని అరచుటయేగా! నాయనలారా! నామస్మరణ చాలగొప్పది. మఱువరాదు, వాసుదేవ! పరమశివ మాం పాహి! అక్షయలింగ మాంపాహి.

భోజనసమయమున మనసులో భగవన్నామము చేయుట చాల పొరపాటు. మానసిక స్మరణము కీర్తన కాదు. అది కేవలము జపమే. నోరార ఉచ్చరించునదే కీర్తనము. మానసికముగా స్మరించుచు చేయుటవలన నీవొక్కడివే ఫల మనుభవించ వచ్చును. నామము యితరులకు వినిపించుటయు పుణ్యమె. భోజన సమయమున మానసిక స్మరణమువలన నీభార్యకు, బిడ్డలకు అన్యాయము చేసిన వాడవగుదువు. నీభార్య, బిడ్డలు నీకెంత ప్రేమపాత్రులో ఆలోచించుకొనుము. బిగ్గరగా నుచ్చరించుచు భుజించుచుండిన, నీభార్యబిడ్డలు అనకున్నను వారుకూడ విందురుగదా! వారికిని ఫలము గలు

గును. గాన బిగ్గరగా గోవింద! కేశవ! శివ! శంకరా! యనుచు భుజించుట మంచిది. "హరహరశంభో"

*　　*

"ఆ హా ర ము"

ఆహారము మానవజీవితమున కాధారముగదా! శరీరధారణకు ఆహారము ప్రధానముగదా! ఆహారమున మనకు తెలియని దోషము లుండును. నీ సంపాదన న్యాయము, పవిత్రము కావచ్చును. నీ దినచర్యకూడ మంచిదే. నాయనా! నీవు గ్రహించుటకు ముందే ఆప దార్థమున ఏదో దోషము ఆపాదించి యుండును. అట్టి దోషభూయిష్టమైన ఆహారమును స్వీకరించుట వలన ఆ దోషము నీకుసంక్రమించును. మరియు అపవిత్రమైన ఆహా రమును గ్రహించుట వలన మానసము అపవిత్ర మగును. అపవిత్రమగు మ న సు తో ఏమిచేసినను అంతయు అపవిత్రమే కదా!

ఆహారము (ద్రవ్యములు) సంపాదించుటలో చాల జాగ్రతగ పవిత్రభావముతో సంపాదించితి వనుకొనుము.

ఏవిధమయిన అపవిత్రతయు లేనటుల నీకు నమ్మకమే, మంచిది. కాని ఆహారము తయారు చేయుటలో మనకు తెలియకుండ అపవిత్ర మగును. తయారు చేయువారు కూడ యిది గమనించరు. ఎట్లందురా! వినండి. ఆహారము తయారు చేయునపుడు (వండునపుడు) స్త్రీలు నోటితో ఊదుట, వాసనచూచుట మొదలయిన పనులు సహజ ముగా జరుగుచుండును. ఈ పనులు లేకుండ తయారు చేయుట సాధ్యమా! అనవచ్చును. సాధ్యముకాదు. ఇట్టి తరి ఆహారము పవిత్ర మెట్లగు నందురా! వినండి. భగవ న్నామము అపవిత్రముల నన్నిటిని పవిత్రము చేయును. ఒక్క ఆహారపదార్థమేకాదు, అన్నియు పవిత్రము చేయును భగవన్నామము. మనకు తెలియకుండ యీపని జరుగును. గాన భగవన్నామము చేయుచు ఆహారమును గ్రహించవలయును.

పవిత్రమయిన ఆహారము గ్రహించుటవలన ముఖ్య ముగా మనసు బాగుపడును. పవిత్రభావము లుదయిం చును. భగవద్భక్తి గలుగును. నామమునం దభిరుచియు గలుగును. దోషభావములు క్రమముగా నశించును. ప్రాణులయెడ దయకలుగును. భోజన సమయమున విధిగా

నామనిష్ఠ కలిగి యుండవలయును.నీపం క్తిని కూర్చున్న వారినికూడ భ గ వ న్నా మ ము చేయుచు భుజింపుమని కోరుము. అతిథి, అభ్యాగతులను గూడ యి దేవిధమున ప్రార్థించుము. తుదకు "భగవన్నామము చేయకున్న మాయింట భోజనము పెట్టమనుము" బాధలేదు-పాపము లేదు. ఇందువలన ఎదుటివారికి భగవదనుగ్రహము గలిగించిన వాడ వగుదువు. ఆనాడు భగవన్నామము జేయువాడే నీయింటికి వస్తాడు. ఇందులకు భగవంతుడు కూడ మెచ్చుకుంటాడు. బోలో నామభగవానునికి జై.

*          *          *

మానవుడు తరించుటకు సులభోపాయములు చాల కలవు. అమూల్యమైన మానవజన్మను వ్యర్థముగా పశు పక్ష్యాదులుగా మరలపుట్టునటుల చేయరాదు. నీవు యేది గ్రహించినను, అనుభవించినను, భగవన్నామముతోనే చేయుము. నామముయొక్క శక్తి నామాధిష్ఠుడైన భగవంతుడుకూడ చెప్పలేడు. ఆయనయె స్వయంగా చెప్పినాడు. "నాపేరుకుగల శక్తి నాకులేదు," నూతన వస్తువులు, వస్త్రములు, ఆభరణములు, తినుపదార్థ

ము:లు మొదలగున వన్నియు తొలుత భగవంతుని కర్పించి పిమ్మట నీ వనుభవించుము. మనజీవితావసరము లన్నియు భగవంతు డిచ్చినవే కదా! ఆయనకు సమ ర్పించినది ప్రసాదము (అనుగ్రహము) అగును. భగవ దనుగ్రహముగల వానికి కొరత యేముండును? వాసు దేవ! వాసుదేవ! గోవింద గోవింద గోపాల రాధా రమణ!గో॥

*　　　*　　　*

ఈకలికాలమున మానవులు తేలికగా తాము పుణ్యము సంపాదించుచు, ఇతరులచేతకూడ సంపాదింప చేయవచ్చును. ఇది రెండువిధముల తరణము-లాభదాయ కము. సేవకులచేత, పనివారలచేత భగవన్నామము చేయుచు, చేయించుచు పనులు చేయించుము. "స్వామీ! నేను మీ యాజ్ఞానుసారము చేయుదును. జీత గాండ్రు, పనివారు ఎందుకు చేయుదురు? నామము చేయుచుపనిచేయుడనినవారుపనికూడమాని వేయుదురు"- అంటారా! వినండి, దానికి ఉపాయము వినండి. మీ సేవ కులకు, కూలివాండ్రకు, పశులకాపరులకు, దాసికి—

వీరందరకు నీవిచ్చు వేతనముకన్న ఒకరూపాయి ఘెక్కువ యిస్తాను భగవన్నామము చేయుచు పనులు చేయుడనుము. ఎంత బాగా భగవన్నామము జరుగునో! నీ చెవులకు ఎంత ఆనందము. భగవన్నామము చేయుచు పశులకు మేత వేయవలయును. నామము చేయుచు వంట పాత్రలు తోమవలయును. ఈవిధముగా చెప్పితివా నీయిష్ట మొచ్చినటుల భగవన్నామము జరుగును. అపుడు నీ గృహము కలకలలాడుచుండును. నీజీవితము, నీగృహము మంగళములకు స్థానమగును. ఈవిధానమున అనేక విధములయిన సూక్ష్మధర్మములు జరుగును. భగవంతుడు నీయింట నుండి నిన్ను, నీకుటుంబమును సదా రక్షించుచుండును " తననామము స్మరించిన స్థానమున తా నుండుదు ననిగదా భగవంతుని ప్రతిజ్ఞ. మీరందరు ఏమనెదరు? (చాలబాగున్నది) ఈయాచారము, అలవాటు మనప్రాంతమున తక్కువ. ఉత్తరభారతమున బాగాకలదు. నేను చూచితి.

హరేరామ్. వాసుదేవ! శ్రీరామజయరామ జయ జయ రామ.

* * *

ఒకపండితుడు స్వామితో నిట్లనెను. స్వామీ! నేను కొన్నిసంవత్సరములుగా నియమముగా మౌనముతో భుజించుచున్నాను. ఇది పుణ్యముకదా!- "ఎంత వెఱ్ఱి వాడవు? శాస్త్రము చదివితివి. వేదాధ్యయనము చేసితివి. చేయవలసినది చేయుటలేదు - చేయరానిది చేయుచుంటివి. రెండువిధములా అధర్మమె. ఎంతపొరపాటు. నాయనా! మౌనముగా భుజించుట మహాపాపము. సందేహములేదు. మౌనముగా భుజింపుమని ఏశాస్త్రము నందైనా గలదా! భగవన్నామముతో భుజించవలయునని శాస్త్రములు నిర్ణయించినవిగదా! "కబళే కబళే గోవిందకీర్తనమ్" ముద్దముద్దకు గోవిందకీర్తనము చేయుమనికదా! ఇట్టితఱి మౌనముగా భుజించుట దోషము కాదా! ఇతరులకు వినబడునట్లు భగవన్నామ ముచ్చరించుచు భుజించవలయునుగాని, మానసికముగా పనికిరాదు. శాస్త్రము ఏమనిచెప్పుచున్నదో వినుము."- పాద్మము.

భోజనసమయమున భగవన్నామోచ్చారణ చేయకుండ తీసికొను మెత్తని ఆహారపదార్థము కుక్క మాంసము-కఠిన పదార్థము కుక్కఎముకలు - ద్రవపదార్థము కుక్కమూత్రమువంటివి. చూచితివా! ఎంతశోచనీయము?

కనుక భగవన్నామము నుచ్చరించుచు భోజనము చేయుట మానవుని కర్తవ్యము.

సంస్కారము మంచిది కావాలి. ఇందుకు గురూపదేశము మంచిదైన సంస్కారముకూడ మంచిదగును. ఈకాలమున అందరు ఉపదేశకులే. అందరుగురువులే. మంచివారి సన్నిధిలో సంస్కారమహిమ లున్నను కొందరు బాగుపడరు. అట్టివారిని సంస్కారముకలవారు కూడ ఏమాత్రము మార్చలేరు. చూడండి. శాస్త్రిగారు గొప్పపండితులు. వేదాంతులు. ఆయన బోధలు ఎందరో విని బాగుపడుచుండిరి. ఎందరినో ఆయన తరింపజేయుచుండిరి. ఆయనకు గొప్పపేరు, గౌరవము కలదు-పుత్రులందరు ఆంగ్లవిద్యాభ్యాసకులు, ఆంగ్లవేష భాషాప్రియులు. అట్టి పుత్రులకు- "నాయనలారా! బ్రాహ్మణ విహితమగు సంధ్యను ఆచరింపుడు. గాయత్రిని జపింపుడ"ని తండ్రి చెప్పలేకున్నాడు. కారణం - గట్టిగా చెప్పిన ఏమగునో అని భయము, పుత్రవ్యామోహము అడ్డుతగులును. అట్టి పుత్రుల పురోభివృద్ధికి, విద్యాభ్యాసమునకు, శుభకార్యములకు శాస్త్రిగారికి బాధతప్పుట లేదు. ఆయన సత్పురుషుడే. ఆయనకు పద్ధతులే కలుగు

గాక! తండ్రి పుత్రులకు హిత ముపదేశించ లేకపోయ నంటె, విచిత్రమేమి? ఇంతకు సంస్కారమన్నది కావాలి కదా!

"భాగవతోపదేశము."

జీవునికి సుఖమంటే సహజమైన ప్రేమ యున్నది. అందరు సుఖంకోరుతారు. అయితే సుఖముయొక్క నివాసము, లేక సుఖముయొక్క యథార్థ స్వరూప మేమిటి? మూర్తిమాన్. ఈవిషయంలో ప్రజలకు తెలివి తేటలు అనగా జ్ఞానము తలక్రిందుగా యున్నది. ఏవో వస్తువులందు లేక వ్యక్తులందు జనులు సుఖమున్నదని నమ్మకం పెట్టుకుంటారు. అట్టిదానిలో సుఖ ముండుట అసంభవముగాక! సుఖముయొక్క ఛాయగూడా లేదు. అటువంటి పదార్థములు, చూచిచూచి దుఃఖమునే సంపాదించుకుంటారు. నాశకరమైన యే వస్తువునుంచైనా సరే నిత్యసుఖము లభించదు. దీనివలన స్పష్టంఅయిన దేమనగా తనకు యిష్టమైనది సంసారములో యేవస్తువూ లేదు. తనకు యిష్టము (అవినాశి) నాశరహితమైన సుఖము. అటువంటిది కేవలము కృష్ణుడే.మానవుని జీవన

సర్వస్వము, ప్రియుడు, ఏకైకమైన వస్తువు కృష్ణుడే. ఈశ్యామలుడు, సుందరుడు, నెమిలి పింఛమువాడు, పీతాంబరధారి, మనమోహన, నందకిశోరుడే అందరి ప్రాణములకు స్వామి, ప్రభువు, హృదయేశ్వరుడు. ఇటు వంటి నిశ్చయానంతరమే మా న సి క సేవ ప్రారంభ మౌతుంది.

పటమని పెట్టి శ్రద్ధగా ఆరాధన చేయగా చేయగా "పటమును నే నెందుకు సేవించాలి, అనువిచారణ కల్గి తనకన్న వేరుకాదనే భావములో పటదృష్టి వదలి పటమునందు తనయందు తనకు పటమునకు మధ్య సర్వ వ్యాపక రాముని నేను సేవించు తున్నాననే నిజభక్తి ప్రాప్తించును. కనుక ఎక్కడ ఉన్నను నామమును మరువరాదు.

(సా ధ న కు)

భక్తులయొక్క ధ్యానమునుగురించి భగవంతుని యొక్క శబ్దస్పర్శాదుల చింతనము, ధామం, రూపము, లీల, సేవ- ఈనాలుగు ఏకత్రితమైనపుడు సగుణ సాకార భగవధ్యానం అవుతుంది. భగవధ్యానంలో ఆయన

లీలలతో పాటు ఆయన చేష్టలయొక్క చింతనము అత్యం తావశ్యకము. చాలా సహాయము చేకూరును. భగవంతుడు కనుబొమలు, రెప్పలువాల్చుట, బొమలు ముడుచుట - చిరునవ్వు నవ్వుట వీటితో కూడిన సేవ జరుగుతూయుంటే ధ్యానంలో ఆనందము - రసానుభూతి కలుగుతూ యుంటుంది. ఈవిధమైన ఆనంద మనుభవింపనిచో-ధ్యానంలో తన్మయత్వం రాదు. భగవధ్యానం వల్ల మనస్సు సాఫల్యం అవుతుంది. జ్ఞానంవలన బుద్ధి సఫలం, రూపదర్శనమువలన - నేత్రములు సఫలం, ఏమనస్సు చర్మచక్షువులు లేకుండ, భగవంతుని దర్శిస్తుందో ఆమనస్సు చర్మచక్షువులతోగూడ భగవంతుని దర్శిస్తుంది. ఇది అవైజ్ఞానికమైన మాటగాదు.

* * *

మనుష్యుడు నానావిధములైన కోరికలతో చిక్కుకొని యున్నాడు. మనస్సు కోరికల్లో చిక్కుకుంటే భగవత్సేవ యెలా జేయగలుగుతుంది. భగవంతునితో రాగమెందుకు కలుగుతుంది? ఉన్నటువంటి కోరికలలో భగవత్ప్రాప్తియొక్క ఇచ్ఛను కలిపి మరువకుండా వుంచితే శబ్దస్పర్శ రసరూపగంధాదులు అన్నీ శ్రీకృష్ణునిద్వారా

లభించును. అలాగై తే కోరికలు నెరవేరుతాయి. భక్తుడు యిచ్ఛారహితు డవుతాడు-భగవత్ప్రాప్తి సిద్ధిస్తుంది.

*　　*　　*

ఆలంబనము లేకుండా ఉపాసనము - అసంభవము. ఒకటి వదిలితే మరొకటి పట్టుకోవటము, అందుకనే పాదాది శిరఃపర్యంతము మనస్సు స్థిరమైతే పూర్ణస్వరూపము ధ్యానం-జెప్పినారు.

*　　*　　*

భగవంతుని కంఠమునందు వున్న మణి జీవతత్వము. దానిరంగు ఎరుపు. అది నిశ్ఛిద్రము, నిర్బంధము-మరియు జ్యోతిర్మయము-ఎల్లపుడు భగవంతుని అంటిపెట్టుకొని వుంటుంది. అనురాగముయొక్క రంగుకూడ ఎరుపే. జీవుడు-నిశ్ఛిద్రుడై శుద్ధాంతఃకరణతో ప్రేమతో నిండి పోవునో భగవంతుడు వానిని తనవద్దకు పిలుచుకొనును. వానికి భగవత్సామీప్యం ప్రాప్తిస్తుంది. భక్తుడు తనను భగవంతుని ఒడిలో జూచును, భగవంతుని ఒడిలో యుండటము ప్రపత్తి-భగవంతుని కూర్చుండ బెట్టుకొనుట ప్రేమ.

శ్రద్ధ-అనుగ్రహము యీరెండును జోడా. శిష్యుని యొక్క- శ్రద్ధ గురునియొక్క- అనుగ్రహము కలసి శక్తి పాతము జరుగుతుంది. సిద్ధే భగవంతుని ప్రకటింప జేస్తుంది. హృదయమనే అద్దమును శ్రీకృష్ణ విర హాగ్నిలో వేసి కరిగించు-శ్రీకృష్ణాకారితము జేయుము. అప్పుడు స్త్రీపుత్రా ద్యాకారత్వము లేకుండా తనంతటదే నశించిపోతుంది. ఎంతవరకు భగవంతుని గురించి వికా రము గలుగకుండునో అంతవరకు సంసారవికారము నశించదు.

* * *

భగవంతునికి అభిమానమంటే ద్వేషము-దైన్యము వినయము అంటే ప్రేమ-భక్తుడు తన అభిమానము-పెద్ద రికము వదలి భగవంతునివైపు తిరిగిన అతడుగూడా తన గొప్పతనాన్ని వదలి భక్తునివైపు వచ్చును.

ఎవని హృదయంలో నెంత నిష్ట-విశ్వాసము- ప్రేమ యుండునో తదనుసారంగా భగవంతుడు తల్లి గాను-తండ్రిగాను వస్తాడు.

* * *

దేవకీవసుదేవులకు-భగవంతుడు లేడు. జ్ఞానంవలన అహంకారము పోతుంది - భక్తివలన మమకారం నశిస్తుంది.

భగవన్నామం అంత్యసమయంలో స్మరిస్తే ముక్తి అని జెప్పినారు. దానికి ఒకజీవన్ముక్త మహానుభావులు జెప్పినారు. అంత్యకాలం అంటే ప్రాణంపోయే ముందు కాదు. ఒకసారి భగవన్నామం వుచ్చరించిన తరువాత-మధ్యలో మధ్యలో ఎంతకాలం జీవించినాసరే పాపం జరుగకుండా వుంటే ముక్తి నిశ్చయం అనిచెప్పినారు. ఇంకా అద్భుతవిషయాలు నామాన్ని గురించి జెప్పినారు.

*　　*　　*

కృష్ణనామానికి-చక్కని భావం జెప్పినారు

క-కంఠస్థానీయ స్వప్నాభిమానియైన మనో రాజ్యంలో సంలగ్న జీవుడు.

ఋ-మూర్ధస్థానీయ పరబ్రహ్మ పరమాత్మ.

ష-ణ-ఇరువురయొక్క మిలనము యెప్పటికి. కృష్ణ.

కృష్ణ-కర్షతి-కృషతివా=ఎవడు పొలము దున్ను తాడో భక్తునియొక్క హృదయమే పొలం-దున్నే వాడు కృష్ణుడు. కఠోరమైన భూమిని కోమలం జేస్తాడు. ఎండి వుంటే నీళ్ళు పెడతాడు. మమత-మోహం అనే రాళ్ళను ఏరిపారేస్తాడు. వాసనారూపి గడ్డిని పెళ్ళగించేస్తాడు. సద్గుణములనే ఎరువు వేసి, సుక్షేత్రాన్ని జేస్తాడు. ప్రేమ బీజమును నాటుతాడు. దాని అంకురము, పత్రము-పుష్పము-ఫలము జూచి ప్రసన్నుడగును. పరిపక్వమైన పిదప రసాస్వాదనము జేయును. నిజముగా కృష్ణుడు ఒక కృషికుడు. కృష్ణ-అంటే నలుపు-నీలము-శ్యామము-యశోద అనే ఉత్సంగ రూపసరోవరంలో వికసించిన నీల కమలము. యశోదయొక్క స్తన్యపానముజేయు-శిశువు-సాక్షాత్ పరమాత్మ.

* * *

గొల్లపిల్లలు ఒకరోజున గోవులను మేపుచూ ఆట లలో పడిరి. అప్పుడు ఆవులు దూరంగా వెళ్ళినవి. ఇందులో భగవంతునికి విముఖతగల హేతువును చూపి నారు. ఇంద్రియాలు అనగా "గా". ఎప్పుడు భగవం

తునితో విముఖత్వం గలిగియుండును? వానిలో లోభము యెప్పుడైతే వస్తుందో మన ఇంద్రియాలు గోపాలునితో విముఖమై విషయ వనములలో ఎందుకు తిరిగినాయి! వానిలో తృణముయొక్క లోభము వచ్చినందున విషయ వనాల్లో పడినాయి. భగవంతునితో విరాగము-గడ్డితో రాగము. ఫలమేమైన దనగా వనంలో నిప్పంటుకున్నది. దావాగ్ని ప్రకటమైంది. అందరూ కాలిపో సాగెను. అందరూ కృష్ణుని పిలవగా యేమిలేదు, కొంచెం దోషం వుంది మీకళ్ళకు. ఇది దృష్టి సృష్టి-ఈశ్వరుణ్ణి చూచుట మాని సంసారాన్ని చూస్తున్నారు. కళ్ళు మూసుకోండి. అప్పుడు అంతా కళ్ళుమూసుకొంటే శ్రీకృష్ణుడు దావానల మంతయు త్రాగినాడు. దావానలము గూడా రెండు విధాలు వుంటుంది. ఒకటి అసురుడు, రెండు దేవత.

మీరు శ్రీమద్భాగవతం యొక్క రెండురకములైన దావాగ్ని పాన ప్రసంగాన్ని చక్కగా చదివితే యీభేదం మీకు తెలిసిపోతుంది. ఈరెండు విధములైన దావానల ప్రసంగంలో దేవతలొచ్చారు. సేవ చేసుకున్నారు. దైత్యులొచ్చి దుఃఖంపెట్టినారు. దేవతలు-దైత్యులు, ఇదే వివేకము. భగవంతుని సేవించుటకు

ఎవరు వచ్చినారు? అంటే కాళియమర్దన ప్రసంగంలో ఆమాట వచ్చినది. ఆరోజు పగలంతా అందరూ ఆకలి దప్పులతో అలసిపోయి యున్నారు. శ్రీకృష్ణుడు కాళియమర్దన మొనరించి హ్రదం నుంచి వచ్చినప్పుడు గొల్లలు - గోపికలు - గోవులు_తండ్రీ-తల్లీ యెవ్వరు యింటికి పోలేక పోయిరి. కాళీహ్రం వద్ద దావానలం కుండం వద్ద పడుకున్నారు. అక్కడ అగ్నిదేవత తెల్ల వారగానే ఆవులు గడ్డిమేస్తాయేమో నని ఆలోచింప మొదలిడెను. అంతేకాదు. గొల్లపిల్లలు - గోపికలు యిక్కడ పండు తింటారేమో నని ఉద్దేశపడినాడు. కారణం యేమనగా యిక్కడ చుట్టుప్రక్కనగల తృణ తరువులయందు కాళియనాగుని విషముయొక్క ప్రభావము వున్నది. అందుచేత వీటన్నిటిని భస్మం చేయటం మంచిది. నూతనమైన గడ్డి మరల మొలుచును. ఇక్కడ వున్న దావానలుడు సేవకుడు, దేవత, ముంజవనంలో గోవులను అటకాయించిన వాడు అసురుడు. వాడు కష్టములు పెట్టుటకే వచ్చెను. అయితే శ్రీకృష్ణుడు రెండు స్థలములలోను అగ్నిని పాన మొనరించెను.

* * *

ఎవడు మేకను పూర్తిగా మింగుతాడో వాణ్ణి అజగరు డంటారు. శ్రీకృష్ణుడూ అజమే. కాని నేను ఇలా అలాంటి అజమును గాను. శ్రీకృష్ణపేరు సదాముఖంలో యుండాలి-అయితే వానిమూర్తి యెప్పుడూ యుండరాదు. అఘాసురుడు శ్రీకృష్ణమూర్తిని గూడా నోట్లో పెట్టుకున్నాడు. ఫలం ఏమిటంటే వాని ప్రాణమార్గం ఆగిపోయినది.

ఇంక యీమార్గంతో ప్రాణాన్ని రానివ్వము-పోనివ్వము - ప్రాణాలున్నాయి. నీవు మాకు అడ్డు వచ్చావు. మా మార్గాన్ని నీవు అడ్డుపెట్టావు. (అడ్డు తగిలావు) ఫల మేమైందంటే-ప్రాణాలు నీమార్గం గుండా పోతా మని బ్రహ్మరంధ్రంనుంచి ప్రాణాలు వెళ్ళినాయి.

అఘాసురలీల! ఋషులు, మునులు దేవీ, దేవతలు గూడానే కాదు మంచి వారందరూ పాపము నుండి తప్పించు కుంటారు. సంస్కృతంలో పాపం పేరు-అఘం, "న హన్యతే భోగం వినా" ఇది భోగించకుండా నశించదు. పాపఫలం అనుభవించియే తీరవలెను. కాని శ్రీకృష్ణుడు యీ అఘాసురునితో గూడా క్రీడించెను.

అతడి నోట్లోకి గూడా వెళ్ళినాడు. వాణ్ణీ ముక్తుణ్ణి చేశాడు. ఈలీలను విచారించండి.

గొల్లపిల్లలతో దూడలు మేపుకుంటూ శ్రీకృష్ణుడు బృందావనంలో క్రీడలు సలుపుకుంటున్నాడు. అక్కడికి అఘాసురుడు వచ్చి పడినాడు. ఎవడు యితరులయొక్క సుఖాన్ని చూడలేడో వాడు పాపిష్టివాడు. ఇతరుల యొక్క-సుఖాన్ని జూచి యెవడు ఈర్ష్యాలువో, మన స్సులో ద్వేషంవుంటే మనస్సులో పాపం వుందని తెలుసుకోవాలి-ఇతరులయొక్క సుఖాన్ని సహించలేక పోవుటయే పాపముయొక్క లక్షణము. సంకటం యెప్పు డొస్తుందో ముందు జెప్పినారు. శ్రీకృష్ణుని మీదనుంచి దృష్టి తొలిగితే సంకటం వస్తుందని-ఇక్కడ కూడా అంతే జరిగింది. అఘాసురుడు వచ్చాడు. గొల్లబాలు రకు శ్రీకృష్ణుని మీదనుంచి చూపు తొలిగింది. వాడి మీద పడింది. ఏభక్తుడు భగవంతునితో ఆడుచున్నాడో వాడు అఘాసురుణ్ణి చూస్తున్నాడు.

వాణ్ణి చూచి యిది ఒక అద్భుతమైన గుహలాగు న్నదని ఇందులో దోవవున్నదని, చూస్తూ చూస్తూ

సంతోషంతో చప్పట్లు కొట్టుకొంటూ వాడినోట్లో ప్రవేశించారు. భగవంతుని సన్నిధిలో సఖ్యరసంలో ఆవేశంలో ఆయనతో సమానత్వము మరియు భగవద్విస్మరణ అఘాసురుని ముఖంలో ప్రవేశము. ఈఅఘముఖ ప్రవేశము ఎందుకు జరిగిందంటే కేవలం భగవంతుని మరచి పోవటంచేత. విముఖతవలన అయితే భగవంతుడు వారిని రక్షించెను. ఎందుకు వారిమనములో విశ్వాసము? యేమన? మేము అనుచిత స్థానములోకి పోయినామా సఖుడు మమ్మల్ని రక్షిస్తాడని. వారి యీ విశ్వాసముయొక్క రక్షకొరకు శ్రీకృష్ణుడు అఘాసురుని ముఖంలో ప్రవేశించాడు.

వస్తుతః సంసారముయొక్క ప్రత్యేక వస్తువులో పరమాత్మ వుండియే యున్నాడు. అఘాసురుని శరీరం ఎలావున్నది-అలాపడివున్నది అందులోంచి ఒక జ్యోతి లేచింది. శ్రీకృష్ణుని శరీరంలో కలిసిపోయింది. అఘాసురుని పేరు బ్రహ్మగారు. అజగరు డని పేరుపెట్టారు. "అజః గతే మే భవితా" శ్రీకృష్ణుడు నానోటిలోకి వస్తాడు. అని ఆలోచించి వాడు అధముఖుడైనాడు.

లోకంలో యాశబ్దా యొక్క వ్యుత్పత్తి ఇంకోలా యున్నది. మేకను "అజ" అంటారు.

*　　*　　*

తనయొక్క భక్తులను ఆశ్రితులను రక్షించుట కొరకై పరమ సుందరుడును, పరమ మధురుడును అయిన భగవానుడు అగ్నినికూడా పాన మొనరించును. కృష్ణా! నీవు అగ్నిని పానంచేశావు కదా! ముఖంలో, లేక నాలుకమీద బొబ్బలు పడలేదు కదా? యని శ్రీబలరాము డడిగెను. అన్నయ్యా! మనము చంద్ర వంశీయుల మని నీకు తెలుసును కదా? చకోరపక్షి ప్రేమతో అగ్నికణములు తింటుంది. నేను ఆయన యొక్క వంశజుడను. అగ్ని నన్ను ఏమి చెడుపు చేయ గలడు?

నీవు అగ్నిని ఎందుకు పాన మొనరించితివి? అని ఒకడడిగెను. అతడు బహుశా దార్శనికుడై ఉండును. కార్యముయొక్క లయము సదా కారణములోనే కల్గు తుంది. "ముఖా దగ్ని రజాయత" యను ప్రకారము నాయొక్క ముఖమునుండిగదా అగ్ని ఉద్భవించెను. అత ఏవ దానియొక్క లయముకూడా ముఖమునందే కల్గాలి.

ఇంకొక వైద్యుడుకూడా అడిగినాడట. "విషస్య
విష మౌషధమ్" ఇది చికిత్సా శాస్త్రము. నా
ముఖములో పూతనయొక్క స్తనములకు రాసుకొని
వచ్చిన విషముయొక్క మంట ఉన్నది. కాళీయుని
యొక్క విషతాపము కూడ ఉన్నది. ఎంతో కాలము
నుండి యున్న ఈ తాపమును శాంతింప చేసుకొనుటకు
దావాగ్నియొక్క తాపము అక్కడకు అనగా నోటి
లోనికి పంపించితిని. తాత్పర్యమేమనగా భగవద్విముఖు
డైనవాడు కష్టములలో పడును. మరియు తనయొక్క
ఆశ్రితులను భగవంతుడు సదా రక్షించును. అసురుడు
కూడ కృష్ణునకు స్నేహితు డయ్యెను. ఇది ప్రలంబా
సురుని విషయము.

* * *

గొల్లపిల్లలు శ్రీకృష్ణుణ్ణి, ఎంతగా ప్రేమించినారంటే
వారివయస్సులో వారికి ఎప్పుడు వివాహమైందో అంతే,
కాదు-వారి భార్యల విషయంకూడ వారికి తెలియదు.
సంయోగం కల్గితే కృష్ణుడితో, వియోగము కలిగితే
కృష్ణుడితో, గొల్లపిల్లలతో శ్రీకృష్ణునియొక్క ప్రేమ

ఎంతగా నున్నదని చూచి కృష్ణా నేనుకూడ నీకు సఖు
డన ఆడుకొన దలచినానని ప్రలంబాసురుడు ప్రస్తావన
తెచ్చెను. ఇప్పుడు ఒకపెద్ద సమస్య శ్రీకృష్ణునికి కల్గినది.
ఏమని? ఎవడైనా వచ్చి నన్ను నీస్నేహితునిగా యుంచు
కొమ్మనినచో కాదన ఎట్లా అనగలను. జీవమాత్రునకు
ఎవడు సఖుడో అట్టి భగవానుడు ఎవడిని స్నేహితు డని
ఎవడిని స్నేహితుడు కాదని వివేక మొనరించును. అథవా
సఖునిగా చేసుకొనిన వాడిని చంపు టెట్లు? స్నేహితుని
చేసుకొని చంపుట మున్నదే ఘోరఅన్యాయమైన మాట
అగును, అయినప్పటికి ఏదోఒకయుక్తిని వెదకెను. గొల్ల
పిల్లలందరు గుండ్రముగా శ్రీకృష్ణునియొక్క సంకేత
ముతో నిలబడినారు. ప్రలంబాసురుడు శ్రీకృష్ణుని
యొక్క కంఠమును పట్టుకొనెను. ఆటలలో శ్రీకృష్ణ
పరంగా అందరూ ఓడిపోయిరి. గెలిచిన వారందరిని
భుజముల మీద కూర్చిబెట్టుకొని మోయసాగిరి. ప్రలం
బాసురుడు బలరాముణ్ణి భుజము మీద కూర్చోబెట్టు
కొని ఎగిరి పోయెను. బలరామునకు వీడు కృష్ణునిమిత్రుడు,
వారివైపు వాడు, అటువైపు నుండే ఆడుతున్నాడు.
అయినా నన్నెగరగొట్టుక పోతున్నాడు. ఏమిచేసేది? చంప

వలయునా? చంపకూడదా? తమ్మునియొక్క మిత్రుడని తెలిసికొని అసమంజసములో పడిన అన్నగారితో వీడు ఇక స్నేహితుడుకాడు. అని శ్రీకృష్ణుడు అనెను. ఏరూప ముతో వచ్చియుండెనో ఆరూపుడై పోవుగాక, వెంటనే వానియొక్క రూపము కూడా మారిపోయెను. సరే మంచిదే వాడికి అదే రూపమును ఇచ్చెదనని చెప్పి బల రాముడు వానినెత్తిమీద ఒకగుద్దు గుద్దితే తలపగిలింది. మరియు అసురరూపము కూడ నష్టమైనది.

మరల వాడు స్నేహితునియొక్క రూపమునే పొం దెను. ఏమన ఒకపర్యాయము శ్రీకృష్ణునియొక్క స్నేహి తుడగుటకు వచ్చిన వ్యక్తికి ఎప్పుడైనా ఇంకొక భావ మును పొందటము అసంభవము. అసుర వధ అనగా పంచభూతశుద్ధి, అసురులయొక్క పేరులుగూడ విలక్షణ ముగా నున్నవి. కృష్ణుడు తృణావర్తుణ్ణి చంపినాడు. ఇది వాయుశుద్ధి. దావానల పాన మొనరించెను. ఇది అగ్ని శుద్ధి. వ్యోమాసురుని చంపెను. ఇది ఆకాశము యొక్క శుద్ధి. కాళీయ నాగుని దమనము వలన జలముయొక్క శుద్ధి. పూతనయొక్క విషపానము. శకటాసుర భంజనము

పృథ్వియొక్క శుద్ధి. పంచ భూతములు అసుర భావా
పన్నములై పోయెను. వారియొక్క అసురభావమును
నాశన మొనరించి వారిలో వచ్చినటువంటి దోషము
లను తొలగించి వారిని సర్వోపయోగాకరముగా చేయు
టయే శ్రీకృష్ణ లీలయొక్క ఉద్దేశ్యము.

*            *            *

వస్తువు చేజిక్కి తరువాత బాగా ఆనందంగా
తన్మయం గాకపోతే ఆవస్తువుయొక్క సంగతి అనుభవ
పూర్వకంగా తెలియదు. ఆ శ్యామసుందరుడు - మనం
లేస్తే లేసున్నాడు-కూర్చుంటే మనతోనే కూర్చుంటు
న్నాడు - తింటే తింటున్నాడు. చూపు వెనుక, చెవి
వెనుక, నాలుక వెనుక, నాసిక వెనుక-వుండి సహాయం
చేసేదెవరు? శ్యామసుందరుడే, శ్రీకృష్ణుడే. ప్రహ్లాదుని
యొక్క ప్రత్యక్ష అనుభవం యిదే. మనకిగూడ అంతే
అలాగే జరుగుతూంది. మనం జూసి ప్రయత్నిస్తే తెలు
స్తుంది. కృష్ణుడే-ఇంకెవరు? తల్లితండ్రిరూపంగాయెవరు
న్నారు? చర్మాన్ని-ఆకుల్ని చూస్తే వాడు గుర్తుకు
వస్తాడా? ఇవి ప్రపంచక నానారూపాలు. తల్లిదండ్రులు

దివ్యస్వరూపులు. అందుకనే వారిసేవ భగవత్సేవ యనినారు. అంతేగాదు. కృష్ణునకు అత్యంత ఇష్టమైన విషయం ఏమిటో తెలుసా ? ఆయన భాగవతంలో పునఃపునః జెప్పినాడు. "సర్వభూతదయ, కాగోలూకని సేవాయం, సంసారో జ్ఞాత్మవేదినః" అనగా భక్తుడు-ప్రపన్నుడు అంతా కృష్ణమయగా జూస్తాడు. అభక్తుడు-ఆకృష్ణుణ్నే, ఆనారాయణున్నే ప్రపంచంగా జూస్తాడు. ప్రపంచం అనగా నరకమే. అందుచే దృఢంగా సైసాధన యేమాత్రం చూద్దాంలే అని అశ్రద్ధ చేయక వైశాఖ మాసం - పురుషోత్తమమాసం అధికఫలం, ఏమనగా దానికి అధిపతి సూర్యుడుగాదు. కృష్ణుడే.

కృష్ణనామం అర్థం కృష్ణుడే. ఆకృష్ణుని నీయిష్టం వచ్చిన అలంకారం చేసికొని-నీయిష్టంవచ్చిన నివేదనలు -ఇంకాసేవలు జేస్తూ వున్నట్లుగా, లేక వేణువూదుతుంటే ఆవేణునాదం వింటూ, లేక గోవులమందతో వాటిని మేపుతూ యున్నట్లూ, హృదయంలో ధ్యానం జేస్తూ జపం జరగాలి. అంతేకాదు, ఏపనిజేస్తున్నా నీతోటే వున్నట్టు జూసుకోవాలి. ఉన్నట్టుగాదు వుంటున్నాడు.

విచారించు :- నా చిత్తం (హృదయం)లో యేఅశాన్తి లేక అసంతోషముందో అదియే లేకపోవుటవలన? నిజంగా నేను అనేకరకములైన అభావములతో నిండి యున్నానా? ఏదిలభిస్తే అన్ని అభావములు పూర్తి యగునో ఆ వస్తువు యేది? నిజముగా నిశ్చయముగా అటువంటి వస్తువు శ్యామసుందరుడే. ఎంతవరకు అతడు ప్రాప్తించడో అంతవరకు ఈ జీవితంలో నున్న అభావములు యెందుకు ఉండవు? నేను ఆ శ్యామసుందరుని నిశ్చయముగా పొందగలను.

* * *

ఎప్పుడైతే నాయొక్క ఆవశ్యకతలను (కోరికలను) నీకంటే ఎక్కువ తెలిసినటువంటి, మరియు వాటిని నెరవేర్చేవాడు సిద్ధంగా యుండగా యింకనీకు కోరికలెందుకు? శ్యామసుందరుని విశ్వసించుము. కొంచెము విచారించు. అతడికి నీయొక్క యోగక్షేమముల గురించి యెంతగా జ్ఞానము ధ్యానమున్నదో?

ఏభగవంతుని ఆరాధించుటకు యెవరిద్వారా యీ వుపాధి లభించినదో అట్టి భగవత్స్వరూపులైన తల్లి

తల్లిదండ్రులకు అతిశ్రద్ధతో వందనము చేయుచున్నావా ! ఇదిలేక గురు,గోవిందుల ప్రసన్నత అసంభవం.

* * *

నీ హృదయంలో ఒక దివ్యజ్యోతి అహర్నిశల ప్రకాశించుచున్నది. కోరికలనే తెర దానిమీదపడవేయకు. దాన్నే యింకా ప్రజ్వలింపజేసి ఉన్నకోరికలన్నింటిని దానిలో భస్మ మొనరింపుము. ఇది యెంతో పవిత్రమైన హోమము. ఆజ్యోతియే నారాయణుడు-నందకుమారుడు గోవిందుడు.

* * * *

ఇపుడే భగవంతుడు నీవద్దకు వస్తే ఆయనను నీవు యెక్కడ కూర్చోబెట్టెదవు ? బయటగాని లోపలగాని యెక్కడైనా సరే ఆయనను కూర్చోబెట్టే యోగ్య స్థానము తయారుగా యుంచినావా ? ఇకనుండి నీహృదయమందిరము స్వచ్ఛముగా యుంచుకొనుము.

* * * *

ఎప్పుడైనా నీయొక్క యిచ్ఛకు విరుద్ధంగా భగవంతుడు యేమయినా జేస్తాడు. అప్పుడే ఆయనయొక్క

వాత్సల్యస్నేహము అత్యధికముగా ప్రకాశించుచుండును. అతడు నీయిచ్ఛలను తనయొక్క ఇచ్ఛానుసారముగా వుంచదలచును. ఇది అతనియొక్క మహాదనుగ్రహము. ఈ విధముగా ఆయన యెలా సంరక్షిస్తున్నాడో జాడ తెలుస్తూ యుంటుంది.

నీవు యేం చేస్తున్నావో, యేంమాట్లాడుతున్నావో, యేమి ఆలోచిస్తున్నావో అంతయు భగవంతుని సన్నిధినే యని మరువక గుర్తుంచుకో!

*         *         *

నాహృదయంలో శ్రీకృష్ణుడు సింహాసనముమీద విరాజమానుడై యున్నాడు. నాయొక్క ప్రత్యేక సంకల్పన్ని క్రియను అతడు జూస్తున్నాడు. అతడు నాతో ఆడుచున్నాడు. ప్రసన్నంగా జూస్తున్నాడు. నేనంతటి భాగ్యవంతురాలిని (వంతుడను). భగవంతునికి ఆట వస్తువునై ఆడుటకు సాధనగా అయి, అతనిని సంతోషింపజేయు చున్నాను. అని అనుభవించాలి.

*         *         *

ఎంతవరకు జీవితంలో శ్రీకృష్ణుడు ప్రవేశించడో అంతవరకు దుర్గుణములు నశించి-సద్గుణములు గలుగవు. అంతట శ్రీకృష్ణుని దర్శించుము. ఆకాశాన్ని జూచి భగవంతునియొక్క శ్యామవర్ణమును స్మరించుకోవాలి. మేఘాల్ని జూచి ఘనశ్యాముణ్ణి, గోవులనుజూచి గోపాలుణ్ణి నెమలినిజూచి నెమలిపింఛధారిని, ధేనువునుజూచి ధేనుకాసంహాసురరుని ఈవిధముగా స్మరించుచుండవలెను.

వ్యాకులతనిజంగా యుంటే భగవంతుడు ఒకరోజు లోగాదు ఒక రెప్పపాటు కాలంలో లభిస్తాడు.

* * *

వృత్తి భగవద్ధామాకారముగా యుండుట, భగవదాకారముగా యుండుట భక్తి యనబడును. మనస్సును గోకులానికి తీసికొనిపో! లేక గోకులమును నీమనస్సులోకి తెచ్చుకో!

* * *

" భజించు విధానము "

ఇంటికి వచ్చిన అతిథిని యెట్లా సేవజేస్తారు? సేవయే

భజన. అలాగే భగవంతుణ్ణి దగ్గరలో దగ్గరగా సంబంధకుడని భావించి (మెంచి) ఆయనను ప్రేమించాలి. తినిపించాలి, త్రాగించాలి, సేవజేయాలి. తిట్టు – కొట్టుడు, అలాయెందుకు? అతడు నీవాడే, అక్కడ కపటం యెందుకు? మర్యాదయేమి చూడనక్కరలేదు. వెన్నవుంటె వెన్నలేకపోతే కొబ్బరే! అయితే అతనితో రోజంతా గడుపు. అతనితో కొట్లాడు-తిట్టు, బ్రతిమాలుకో, ఆడించు – ఆడుకో, శాస్త్రశిష్టాచారం అక్కరలేదు. ప్రేమతో అతనితోటే తిను. స్నానంచేయుము. కూర్చొనుము. పరుండుము. ఆడుము. అతడు నీవాడు నీవు అతనిదానవు (వాడవు). ఏమీతోచకపోతే (రెండుతలముల) నాలుకమీద వానియొక్క- మధురమైన నామమనే పటికబెల్లం రసాన్ని ఆస్వాదిస్తూ యుండుము.

* * *

హృదయమదిరం భగవంతుడు నీదిగదా! అక్కడ దేహాభిమానము, ధనాభిమానము. కులాభిమానముల స్పర్శకలుగరాదు. హెచ్చరిక!

* * *

భ క్తి యొక్క సంస్కారము అతి ప్రబలంగా యుంటుంది. అదిభక్తుని యెన్నటికి పతనం గానీయదు. అది కాపాడుతూ యుంటుంది.

శ్రీకృష్ణ ప్రాప్తివిషయంలో నిరుత్సాహమే, వార్ధక్యము. మరియు ఆయనతో సంబంధము వదలుకొనుటే మృత్యువు. సర్వత్ర ఆయనను స్మరించుటయే అనగా అన్నిటియందు - అందరియందు ఆయనతో సంబంధము.

*　　*　　*

శ్రీకృష్ణస్మరణమే స్మరణ, స్మరణయొక్క "స" భగవంతుడు "స" లేకపోతే అనగా భగవంతుడు లేకపోతే స్మరణ "మరణం" అయినది. అలాగే "స్మృతి"స లేకపోతే "మృతి" అందుచేత నిజమైనస్మరణ జేయుము. భగవంతుని హృదయమందిరంలో యుంచుకో !

సేవజేస్తూ సుఖాన్ని (కోరికలు) కోరుట. లేక సేవ వలన ముక్తి అనగా యిలా యెంతకాలమని, ఎవరికి గలుగుతుందో! ఆభక్తివలన సుఖము పొందలేరు. అట్టి

వారికి భక్తి రహస్యము తెలియలేదు. గాక భక్తి యొక్క సుఖము వారియొక్క హృదయంలో ఉదయించలేదు.

* * *

కృపణు డెవడు? భగవంతుడు లభించకపోయినా, ప్రపంచంలో సుఖంగా యుండుటకు ప్రయత్నించువాడు. బుద్ధిమంతు డెవడు? భగవంతుని కొరకు ప్రపంచమును వదలుటకు సిద్ధముగా యున్న వాడు. ప్రపంచమనగా దేహ బుద్ధే – (భగవద్బుద్ధియుండాలి). అనగా దాసోఽహం ఇత్యాది. ప్రజంలో వాత్సల్యభావం పైకి కనుపరుస్తారు. ఆంతరికంగా మధురభావం– (వల్లభసాంప్రదాయం).

* * *

దోవలోనడుస్తూ నడుస్తూ కాలుజారినా క్రిందపడినా అపరాధంగాదు – పడినవాడు లేచి ముందుకు సాగక పోవుటమే అపరాధము.

సాధకున్ని పొగడ్త పడవేస్తుంది. నిందలేక అవమానం పైకి లేవతీస్తుంది.

* * *

నీయొక్క మనస్సును గోపికను చేయుము. అప్పుడు మనోవృత్తులన్నియు గోపికలయి శ్రీకృష్ణునికొరకు పరు వెత్తును. ప్రపంచంలో సమస్త సౌందర్యము ఒకవైపు— మనమోహనుని చిరునవ్వు మరియొకవైపు దేన్నికోరు కుంటావు. భగవంతుని చిరునవ్వు పూరు, పేరులేకుండా జేస్తుంది. ప్రపంచ సౌందర్యము తుచ్ఛమై పోతుంది. చిరునవ్వు అనగా ఆనందము, సంకరచూపు, జ్ఞానము ఈరెండు భగవంతునిలో నున్నవి. ఆనందాన్ని ఒలక రించటం అనగా చిరునవ్వు నవ్వటం శ్రీకృష్ణునిహాసములో (నవ్వులో) జ్ఞానానందముల సమ్మిశ్రణ మున్నది.

*　　　*　　　*

ఒకసారి గోపికలను వర్ణిస్తూ కృష్ణుడన్నాడు. గోపికలు తమ శరీరములను నాది అనుకునే స్నానం చేస్తారు. అలంకరించుకుంటారు. అందుకని వారికంటేనాకు ప్రేపభాజను లెవరు ఇంకొకరు లేరు అన్నాడు. అంతరి కంగా నడుస్తూ – కుర్చుంటూ, లేక ఎవరితోనైనా మాట్లాడుతూ – ఆలోచిస్తున్నప్పుడు కృష్ణ శక్తితోనో కృష్ణుని ఆధారంతోనో ఆయనను జూస్తూ – ఉండుట

అభ్యసించాలి. ఇది లేకపోతే దేహివాసనలు తమవశం జేసుకుంటాయి. భగవద్విశ్వాసం దూరం అయిపోతుంది.

రోగంవస్తే కృష్ణానుగ్రహం అనుకో, ఇంట్లో ఏ ప్రాణిని, యేవస్తువుని కృష్ణుని సంబంధకులుగా భావిస్తూ వుండాలి. దేహసంబంధీకులు అనుకుంటే మమకారం పెరిగి కృష్ణుడు హృదయమందిరంలో లేకుండా పోతాడు. "మమ" రెండక్షరాలే "మృత్యు" రెండక్షరాలే. అనగా 'మమ', మరణమే. మరియెలా గుండాలి ? " నమమ " నాదికాదు. కృష్ణునిదే సర్వస్వము. "నమమ" మూడక్షరాలు. అమృతం అన్నమాట. త్యాగంవుంటే కృష్ణుడు వున్నట్లే.

* * * *

ఒకసారి లలితాసఖి రాధతో అన్నది – స్వామినీ ! కుందకుంజము చూడుము. వెంటనే శ్రీరాధారాణి అన్నది. 'ము' కారం లేకుండ కుందకుంజముతో నాకేమి ప్రయోజనము. అనగా నాకు ముకుందకుంజము ముకుందుడనే కుంజము కావాలి అన్నది. ఒకరోజు గోవర్ధన ప్రాంతమున వేణువు వాయిస్తూ ఆస్వరలహరిలో రా.........ధా........

రా.......ధా.......అని బయలు దేరింది. అదివిని సరస్వతి మోహితురాలై నది. శ్రీకృష్ణుడు వేణువును వాయించుట ఆపి, అప్పుడు అటు - ఇటూ నలువైపుల పైన క్రింద శ్రీకృష్ణునియొక్క తన్మయతజూచి స ర స్వ తి గూ డ మోహితురాలయినది. ఆమె కృష్ణుని ప్రార్థించి నన్ను గూడా అనుగ్రహించమన కృష్ణుడు తిరస్కరించాడు. ఆమె వెదురు అయింది (జడమైంది). శ్రీకృష్ణుడు మరొక జన్మలో వేణువుగా గ్రహించాడు.

*　　　*　　　*

అప్పుడప్పుడు మనస్సు చంచలంగా వుంటుంది. వుండనీ. ఆశ్చర్యమైనమాటగాదు, అయితే ఆచంచలత్వము వెంటనే ఇష్టదేవునితో జోడించుము. ఏం? అతను తక్కువ చంచలముగలవాడా? మనస్సులో యే ఆలోచన ప్రలోభం వచ్చినా? యెటువంటిదైనా కృష్ణునితో జోడించు. నారద మహర్షి వ్రాశారు. మనస్సులో కామ క్రోధాలు వస్తే వాటిని కృష్ణునితో జోడించుము.

ఒక వృద్ధసాధువు మరణించునపుడు తమ అనుభవ మును చెప్పమని కొందరడిగిరి.

నానోట్లో దంతములున్నవా ? లేవు. నాలుక యున్నదా ? ఉన్నది.

అయితే ఏది గట్టిగా వుంటుందో అది ముందుగా విరిగిపోతుంది. ఏది మెత్తగా వుంటుందో అది స్థిరంగా వుంటుంది. ఇదియే నా అనుభవం.

*  *  *

ఒకడు జారిపడ్డాడు - లేవదీయుమని యరచినాడు. నీవు ఎక్కడ పడ్డావో, ఆ భూమిమీద చేయి వుంచుము లేచిపోదువు.

ఎక్కడున్నవాడి కక్కడే సా ధ న యు ం డా లి. నాలుకుంటే నామం, చేతులుంటే సేవచేయుము. హృదయముంటే భక్తిచేయుము. మస్తిష్కముంటే విచారించుము. అనధికారి చేష్ట చేసినవారికి దుఃఖంగాక యేదియు దొరుకదా !

*  *  *

"అపవర్గము"

అనగా దేనిలోనూ వర్గములేనిది. స్త్రీవర్గము, పురుష వర్గము, బ్రాహ్మణవర్గము, శూద్రవర్గము, ధనవర్గము, పశువర్గము, మనుష్యవర్గము యేవర్గభేదము లేక

యుండునది. పరమాత్మ సమీపమునకు జేరినపుడు వర్గ భేదములేక యుండును, గాన పరమాత్ముడు అప వర్గము.

అపవర్గము - అనగా దేనిలో 'ప' వర్గములేదో పాపం, పుణ్యాం, ఫలం, బంధనం, భోగం, మృత్యువు దేనిలో యీ 'ప' వర్గంలేదో.

భగవత్కథా శ్రవణం వలన అపవర్గమార్గ ములో నడుచుటకు యోగ్యతకలుగును.

కేవలము కథవిన్నందున స్వయంగా లభించును.

* * *

"బ్రహ్మానుభూతిద్వారానే ప్రపంచముయొక్క—

"మథ్యాత్వము"

వేదాంత సిద్ధాంతము హృదయంగమము చేసికొను టకు స్థూలసూక్ష్మ కారణశరీరములలోంచి అహంకార మును వేరుచేయుటయే ఆవశ్యక విషయము. యెంతవరకు

జిజ్ఞాసువు తనశరీరంలో "నేను" వుంచుకొని జగత్సంబంధ మైన యథార్థమును గురించి ప్రయత్నించునో అంతవరకు అది దేహంతో సమానంగా, దృఢంగా కనుపించును. అట్టి దానియొక్క జ్ఞానము ప్రతీతిలేక మిథ్యాశబ్దము యొక్క ప్రయోగం విని పలికినట్టుండును. అట్టిశబ్దముల వలన మృత్యుభయము అజ్ఞానము మరియు దుఃఖము యొక్క నివృత్తి కలగనే కలగదు. అతఏవ జిజ్ఞాసువుకు అన్నిటికంటె మొదటి పనియేమన పరిచ్ఛిన్నంలో చిక్కుకున్న అహాన్ని వివేకంద్వారా వేరుచేయుటయే.

ఏదైనా పరివర్తన శీలమైనది. జడంగాగాని, లేక దుఃఖదాయకంగాగాని తెలిసినట్లయితే అది పరిచ్ఛిన్న అహంయొక్క బలంమీదనే ఆధారపడి యున్నదని ధ్యానమునందుంచుకొన యోగ్యమైనది. పరిచ్ఛిన్నత్వము దృశ్యము మరిఅహంసాక్షియై వుంది. అందుచేత వివేకము యొక్క న్యూనాతిరిక్తముచేగాక రెండింటిని ఒకటియని తలచుటలో కారణమేమియు లేదు. మొదట అనాత్మ నుండి ఆత్మను వివక్తం చేసికొని యుండు ఇది శ్రౌత సాంప్రదాయ క్రమమై యున్నది. ఆకారం సత్ యొక్క

వికారంగాదు, పరిణామమూ గాదు.మిశ్రితంగూడాగాదు. ఆకారం సత్ అసత్ అని చెప్పుటకు వీలులేదు. మారుతూ వుంటుంది. అందుచేత సత్ గాదు. కనబడుటచేత అసత్ గాదు.

చిత్తులో జడత్వంలేదు. ఆనందంలో భోగంలేదు. ఇది సచ్చిదానందాత్మయొక్క సహజస్వరూపం. అపరిణామంగలది. స్వయంప్రకాశమైంది – పరమానందము.

ఆత్మా! మరణశీలం జడం దుఃఖం పరిచ్ఛిన్నత్వం వీటికంటె విలక్షణమైంది గూడాను. సంపూర్ణ దేశ కాలములు వస్తువులకు ప్రకాశము నిచ్చునది స్వప్రకాశమే అయివుంది. అందుచేత ఇదిఅపరిచ్ఛిన్న బ్రహ్మమైయుంది. ఇది శ్రౌత సాంప్రదాయము యొక్క రెండవక్రమము. ఈసిద్ధవస్తువునే తెలియచెప్పుటకు వేదాంతముల యొక్క సార్థకత అయియున్నది. ఎవరు ఈక్రమాన్ని వదలితనకు తోచినక్రమంతో బ్రహ్మైక్య బోధను పొందదలచుకున్నారో వారికిమాత్రం అది సంభవం గాదు.

ఎప్పుడు ఆత్మయొక్క బ్రహ్మరూపము అపరిచ్ఛిన్నత్వముగా అనుభవమునకు వచ్చునో అప్పుడు బ్రహ్మ

దృష్టిద్వారానే సంపూర్ణ దృశ్యము చూడబడుతుంది. దీని మూల్యాంకనం చేయబడుతుంది. బ్రహ్మకంటే అతిరిక్తంగా రెండవది యేవస్తువైనా వున్నటులయితే, ఏకవిజ్ఞానం ద్వారా సర్వవిజ్ఞానం కలుగుతుందను శ్రుతియొక్క యీ ప్రతిజ్ఞ పూర్తిగాకుండా యుండును. పొడుగు, వెడల్పు, వయస్సు మరి బరువు భాసమానమైనప్పటికీ బ్రహ్మదృష్టి ద్వారా అకించిత్కరములు కేవలం ప్రతీతి మాత్రములు అయి యుండును.

వ్యవహారంకోసం వీటికి మిథ్యయను సంజ్ఞ కల్పింపబడింది. వ్యవహారంకోసమే స్వయంసిద్ధమైన ఆత్మ పదార్థముయొక్క సంజ్ఞ బ్రహ్మమై యున్నది. తనను బ్రహ్మనను తెలిసికున్న పిదపనే ప్రపంచము యొక్క పృథక్‌గా యున్న అస్తిత్వము బాధితమై పోతుంది, పరిచ్ఛిన్నంలో "నేను" వుంటె ప్రపంచము యెప్పటికి మిథ్యగానే (తోచదు) గాదు. ఎప్పుడు నీ దేహము, అంతఃకరణము, మరియు బీజముమిథ్యగా అగునో అప్పుడు ద్వైతదృశ్యం కేవలం ప్రతీతిమాత్రంగా యుంటుంది. అక్కడ అక్కడ విన్న టువంటి యుక్తులతో ద్వైతం

యొక్క మిథ్యాత్వం సిద్ధించదు. అది స్వదృష్టి అయి యున్నది. బ్రహ్మదృష్టి అయియున్నది. ద్వైతము మిథ్య యగుటకు అర్థ మేమైయున్నదనగా స్వప్రకాశమైన, అద్వితీయమైన ఆత్మబ్రహ్మమేఅన్యముయొక్క-రూపంలో గాకుండానే ఆవిధంగా తోచుచున్నది. బ్రహ్మతిరిక్త అన్యసత్తా లేనేలేదు.

ఏం జరుగుచున్నదనగా మనం దేహము దేహస్థ పరిచ్ఛిన్నమైన "నేను"ను ఉన్నదున్నట్లుగా చూస్తూ ప్రపంచముయొక్క రహస్యం తెలుసుకొనుటకు ప్రయాస పడుతూ యుంటాము. అందులో శూన్యదృష్టి మాత్రం గలుగుతుంది. అయితే బ్రహ్మానుభూతి మాత్రం గలిగి యుంటుంది.

పరిచ్ఛిన్నమైన "నేను"కు యిది తోస్తూవుంటుంది. దానికి తనయొక్క జీవితం జ్ఞానసుఖములకొరకు సమిష్టితో సంబంధం వుంచవలసి యుంటుంది. అనుకూలంలో రాగం ప్రతికూలంలో ద్వేషం మరియు పునఃపునః ప్రతీయ మానమునందు మోహము గలుగుచూ యుండును. ఈ దోషములను వివేకవైరాగ్యముల ద్వారా నిరాకరించ

కుండా పరిచ్ఛిన్న దేహంలో "నేను" యొక్క పృథక్క రణం జరుగనే జరుగదు. శ్రౌతక్రమముయొక్క ప్రథమ భూమిక సరిగా లభించక పోయినట్లయితే శంకరా చార్యులద్వారా వుపదిష్టమైన అద్వైతం ఆత్మబోధ కీవిషయంలో ప్రాప్తించటం శక్యంగాదు.

అన్నిటికి సారాంశ మేమైయున్నదనగా "నేను"ను పరిచ్ఛిన్నమని అనుకుని ప్రపంచాన్ని మిథ్యగా తెలిసి కొనుటవిపరీతజ్ఞానమై యున్నది. దేహాతిరిక్తమైనఆత్మను బ్రహ్మరూపంతో ఎరిగినమీదట ప్రపంచం మిథ్యాత్వంగా ప్రతీతి యగుచుండును. వ్యావహారిసకత్తాఏకమాత్ర బ్రహ్మ జ్ఞానంద్వారానే బాధిత మౌతుంది. అన్యథాగాదు.

భగవంతునియొక్క నామాన్ని పలకటం జపం చేయటం సుగమం. కాని నామంయొక్క మహిమను గుర్తించటం అసాధ్యమే కాదు, కష్టసాధ్యం గూడాను. గొప్పగొప్ప సాధకులు కూడా నామమహిమను తెలుసు కొనలేరు. ఇక సాధారణమానవులు ఎలా తెలుసుకొన గలుగుతారు. అయినా ప్రయత్నం అవశ్యంగా చేయాలి.

భగవన్నామం ఎలాచేసినా ఏ అవస్థలో చేసినా అది వానిని వుద్ధరిస్తుంది. శ్రద్ధలేకుండా మహిమ నెరుంగక పలికిన నామంవలన అంత్యకాలంలో అజామిళునకు ముక్తివచ్చినది. ఇక శ్రద్ధతో చేసిన నామం వలన ముక్తివస్తుందంటే ఇక సందేహించుట ఎందులకు ?

ఆదరణతో భగవన్నామం పలికితే దుర్లభమైన గొప్పఫలం లభిస్తుంది. ఇంక అవహేళనలో పడుచూ, జారిపోతూ, అంగభంగం జరుగుతూ, పాముకరచినపుడు, కాలినపుడు, దెబ్బతగిలినపుడు " హరే " యనిపలికిన ద్రవించి సహృదయంతో భగవన్నామాన్ని వుచ్చరించునో అతడుకూడ యమయాతన ననుభవించడు.

* * *

డబ్బు అనే నిచ్చెన దొరికితే దాని మీద అలా పైకిపోయి కీర్తి-ప్రతిష్ఠలు, స్వర్గసౌఖ్యాలు అందుకోవచ్చని చాలమంది ఆశపడతారు. కాని యీ నిచ్చెనకు దుఃఖము అశాంతి అనేవిషసర్పాలు పెనవేసుకున్నా

యని, వాటినుండి తప్పించుకోవటం చాలాకష్ట మని అందరికి తెలియదు.

*　　*　　*

డబ్బువల్ల పేరుప్రతిష్ఠలు రావచ్చు కాని చిత్త శుద్ధి రాదు. మాటిమాటికి మానవజన్మవస్తుందనుకొంటు న్నావేమో ? ఏ ఇతరయోనిలో పుట్టినా రామనామం చేసుకోవటానికి వీలులేదు. మానవజన్మ వొక్కదానికే అవకాశ ముంది. ఈ అవకాశం పాడుచేసుకోకండి, ఈ విషయసుఖాలన్నీ అన్నియోనులలో పుట్టి అనుభవించ వచ్చు. కాని రామనామం చేసుకోవటానికి అవకాశం లేదుసుమా !

గోడమీద సూర్యునిబొమ్మ లిఖిస్తే చీకటి పోవటం లేదు. కలియుగంలో ముక్తికి చెప్పినవన్నీ వృథాయే. నామమే గతి. వేదాంతం చెప్పే వాళ్లకి భక్తి శూన్య మైపోతుంది. ఏవంటే వేదాంతం "విధి క్రియావిహీ నానాం" వీరికి రామనామమే ముక్తి. అని వ్యాసుల వారే చెప్పారు.

*　　*　　*

మనిషిలో మార్పు తెచ్చేది కన్నీరే. మనిషిని దేవతగా మార్చేదీ కన్నీరే !

*　　　*　　　*

గోడమీద బొమ్మను జూచి యెవడయినా మోస పోతాడా ? అలాగే రెండురోజులు ముఖంకడుక్కోక పోతే దుర్గంధం బయటకు వస్తుంది. అంతేసుమా జగత్తంతా ! దృశ్యమంతా దుర్గంధమే. రామనామం ఒక్కటే దుర్గంధంలేనిది. రామనామంలేనిచోట మంచి నీళ్లు త్రాగకూడదు. వాళ్లు అస్పృశ్యులు. రామనామం లేనివాడు నిర్ధనుడు. మాధవం రామనామం. మీ ధనమునకు దొంగలభయముంది. మారామనామధనం దగ్గర ఏభయమూలేదు. ఈ రామనామధనం మంచి కష్టసమయంలో ఆదుకుంటుంది. రామనామం లేక పోతే మాకు నష్టమేమిటండీ ? అంటావేమో ? నీకు వెళ్లే ముహూర్తం ఒకటి వస్తోంది. వెళ్లేటప్పుడు నెత్తి,నోరు కొట్టుకుంటూ ఏడుస్తూ పోతావు, జాగ్రత అని అంటారు కబీరు.

ఎవళ్ల హృదయంలో రామనామం వుంటుందో వాళ్లు కృతయుగజీవులే. సన్యాసి కుక్కనైనాసరే ఛీ! అంటే వాడి సన్యాసం తగులబడినట్లే. భర్తనువిడిచి బృందావనంలో నివాసమున్నా నీకు నరకమే. ఇది కలి యుగమని బాగావిచారించుకో. పెద్దలనుకోఅడిగి తెల్సుకో నీయిష్టంవచ్చినట్లు తిరక్కు. విధినిషేధములున్న పనిలో అడుగుపెట్టకు. విధినిషే.ధములు లేని రామనామంలోప్రవే శించు. హృదయం కరిగేలా నామంచెయ్యి. వేదంలో ఎన్నినిషేధాలున్నాయో అన్నీ నీవు చేసినట్లే. రామ నామం చెయ్యకపోతే, వేదములలోని ఉత్తమవిధి రామ నామం. మణినితీసివేస్తే పామునశించి పోతుంది. రామ నామమణిని గ్రహిస్తే జగత్తులొంగి పోతుంది. రామ నామం కల్పవృక్షంలాంటిది. సకలధర్మములలోను పెట్టి సకలభోగభాగ్యములు యిస్తుంది. ఆకల్పవృక్షము మోక్షము యివ్వలేదు. రామనామ కల్పవృక్షము చివరకు మోక్షముకూడ యిస్తుంది. ఇలా కాశీవిశ్వ నాథుడే చెప్పుచున్నారు. ఇంకాసందేహిస్తున్నామంటే అది మనదౌర్భాగ్యమే.

హృదయం దయార్ద్రంకానిది భగవత్కృపా కటాక్ష వీక్షణానికి ఏవిధంగా పాత్రుడౌతాడు ?

* * * *

రామనామముకంటె కలియుగములో రెండవ కల్ప తరువు లేదు. సకలకల్యాణములు రామనామమునందే ఉన్నవి. రామతారకము అందరికి ఆశ్రయనీయము. శ్రేయస్కారములు నామకల్పతరువునే ఉపాసించవలెను.

* * * *

మానవజన్మ గెలుపొందాలంటే భగవన్నామం చెయ్యాలి. భగవన్నామాన్ని అడ్డుపెట్టడానికి వీలులేదు జీవితంలో. గుండుసూది గ్రుచ్చినప్పుడు సినిమా చూచే టప్పుడు వలె స్వర్గసుఖాల్లోను, నరకదుఃఖాల్లోను భగవ న్నామం కుదరదు.

* * * *

అద్దెకొంపలో ఉన్నావు. ఏక్షణంలో లేచి పొమ్మంటారో! జాగ్రత్త. అద్దెకొంపను నమ్ముకోకు సుమా! చెడిపోతావు.

భగవన్నామం మీాయిష్టం వచ్చిననామం కుటుంబ సభ్యులంతా సమిష్టిగా చేసుకోండి. ఇందులో యేద యినా మోసంవుందంటే మానెయ్యండి. సమిష్టిగా యెందుకని? సమష్టిగా తింటున్నాముకదా! పిల్లలికి పెట్టి తింటున్నారుకదా! పిల్లలకు పెట్టకుండా మొద్దుల్లా తిం టున్నారా? పిల్లలకు పెట్టకుండ తింటుంటే వీడు మనిషా! పశువా? అంటారు. పిల్లలికి రామనామం చెప్పకుండా బ్రతుకుచున్నారు. మానవహృదయముంటే సమిష్టిగా చేసుకోండి. సమిష్టిగానామం చెపితేనే సద్గృహస్థుడు స్వగృహం అంటారు.

* * *

శరీరం మహాసౌందర్యవంతంగా వుంది ఐశ్వర్యవం తంగా వుంది. కాని ఏంలాభం? నోట్లో రామనామం లేదు. కుష్టువాడినోట్లో నిరంతరం రామనామం పలుకు తోంది. వాడు ధన్యుడు. దేవాలయంలేని వూళ్ళో ఎట్లా మంచినీళ్ళు త్రాగకూడదో అలాగే ఏయింట్లో రామ నామంలేదో అక్కడ మంచినీళ్లుకూడ త్రాగకూడదు. వాడు అస్పృశ్యుడు. పెదిమలకు రెండు రోగాలుంటా యట. 1 సిగ్గు 2 లోభం. కామలీలలు పాడతారుగాని

రామకీర్తనలుమాత్రం పాడరు. ప్రతిజ్ఞ ఛాలెంజ్ చేసి చెపుతున్నారు. సులభంగా తరించేవుపాయం చెపుతున్నారు. నా జన్మపరంపరలు కత్తిరించు కోటానికి ఈ నామం చాలు. పెనుగాలులు వచ్చినా చలించని విశ్వాసం కావాలి నామవిశ్వాసం. "వీడే మీనాన్న అని తల్లి చెప్పితే చచ్చేదాక నమ్ముతాడు తండ్రియని. అంతేగాని అపనమ్మకం కలుగదు. తండ్రి అవునా-కాదా" అని. అలాగే వేదమాత చెపుతోంది, భగవానుడిగురించి. నీకికి నమ్మకంలేదు.

*　　*　　*

భగవన్నామం చెయ్యకపోతే మోసపోతావు సుమా! జాగ్రత్త. ఇన్ని సుఖములు క్షణికములు సుమా! భక్తులకు ఏవిపత్తువచ్చినా గోటితో తీసిపారేస్తాడు భగవదాశ్రయము ఉన్నవానికి.

*　　*　　*

అచ్యుతుని ఆశ్రయించినవానికి భయమెక్కడిది? భయమునకు చోటేది? భక్తులకు సర్వశ్రేష్ఠ మగు విషయము వినయము. తల్లియొక్క చంకలో పిల్లాడు ఎట్లు

నిర్భయముగ ఆడునో అట్లే భగవంతుని ఆశ్రయములో౽ వానికి యీప్రపంచములో సర్వత్రా సుఖమే కలుగు చుండును. ఎవరిహృదయములో శ్రీహరి యుండడో వారిపై కుటిల కలికాలము ఆధిపత్యము వహించును.

*　*　*　*

భగవన్నామం చెయ్యని నాలుక తోలుముక్క. కనుక కోసి అవతలపారెయ్యమన్నారు తులసీదాసువారు.

*　*　*

జీవాత్మకు పరమాత్మకు భేదం లేదని చెప్పేది రామనామం. కాల్చేసిద్ధి నిప్పుకు ఎలావుందో అలాగే పాపాలను దగ్ధంచేసే శక్తి రామనామంకు వుంది.

రామనామం సంగతి వాల్మీకికి, శివుడికి, విఘ్నేశ్వరుడుకి తెలుసును కొంచెంగా!

చాలా గొప్పఔషధం అంటే ఎంతడబ్బయినా యిచ్చు కొనగలుగుతారు. మహర్షులు చెప్పిన రామ నామం గుణం తెల్సుకోలేరు.

*　*　*

దరిద్రులకు చాలీసా కల్పతరువు. కామధేనువు వంటిది. మారుతి ఆశ్రయములో ఉన్న వారికి సర్వ కార్యములు నెరవేరుతవి. భగవంతుడు మనం ఒకటి అయ్యే వరకు సాధన చెయ్యాలి.

పరుగెత్తుకుపోయే నది సముద్రంలో కలిసి సముద్ర మయినట్లు. బాణం గురిచూచి కొట్టాలి. అలాగే అలాగే నామం చేసేటప్పుడు ఇష్టదేవతా స్వరూపాన్ని గురి పెట్టాలి. బాణం వెడుతుంది. లక్ష్యం చేరదు. అలాగే నామం చెప్తారు. భగవంతుని చేరలేరు.

కాశీలో చచ్చిపోతే ఏపుణ్యం వస్తుందో ప్రయాగలో పడి చస్తే ఏపుణ్యం వస్తుందో రామనామానురాగం వుంటే ముక్తి వస్తుంది. నామం చేసేవాడు ఎట్లా వుండాలి? గడ్డిపరకకన్నా హీనంగా వుండాలి. చెట్టువలె ఓర్పుకలిగి వుండాలి. ఎవరు నిన్ను అగౌరవపరుస్తారో వారికి గౌరవం ఇవ్వాలి.

ఏ దేవుడిని ఉపాసనచేస్తున్నావో ఆదేవుడి యిష్ట ప్రకారం నడచుకోవాలి. అన్నీ నీయిష్టప్రకారం చేసు

కొని తర్వాత దేవుడిని కావాలంటావు. కానీ ఆయన ప్రకారం నడచుకొంటేనే ఆయన నిన్ను వెంటనే "యోగ క్షేమం వహామ్యహం" నిన్ను ఆదుకుంటారు.

అనసూయ x అసూయ అక్క-చెల్లెళ్లు

అనసూయ కొడుకులకు అంతా సులభం.

అసూయ (చెల్లెలు కొడుకులకు) అంతా వ్యతిరేకం. కోటియజ్ఞముల ఫలములకు సమానం ఒక్క-రామనామం. కలియుగంలో కల్పతరువులా రక్షిస్తుంది రామనామం.

*   *

స్నానం చేసేటప్పుడు, అన్నం తినేటప్పుడు, నిద్దుర, పోయేటప్పుడు భగవంతుని తలుచుకో హరి. కృష్ణా, కృష్ణా అంటూవుండాలి. మహామహా ఆపత్తులు వచ్చిన ద్రౌపదీ మున్నగువారు మహామహావ్యాధులు వచ్చిన వారు భగవన్నామం చేసి సుఖించారు. ఎవరి పెదిమలు ఎప్పుడూ రామనామం చెయ్యకపోతే దుర్దినం.

*   *   *

శ్రీకృష్ణుడు గుట్టలుగుట్టలుగా నున్నపాపములను ఒక్కక్షణంలో భస్మముచేయును. అందరు ఆయననే స్మరించవలెను. పరస్పరంగా స్మరింపజేయవలెను. ఈ విధంగా సాధనభక్తిని చేయుచున్నటులైతే క్రమంగా ప్రేమ భక్తిఉదయించును. అతడు ప్రేమోద్రేకంతో పులకితుడై శరీరమును ధరించును.

*                *                *

సమస్తప్రాణులయొక్క అంతరాత్మ శ్రీకృష్ణుడే. అతడు తనయొక్క మాయవలన జగత్తు నుద్ధరించుటకు దేహముగలవానివలె తోచుచుండును.

నందుడు గోపకులు మరియు వ్రజాంగనలయొక్క లోకోత్తర సౌభాగ్యమువలన పూర్ణసచ్చిదానంద ఘనపరబ్రహ్మ స్నేహితుడుగా వారలకు ప్రకటమయ్యెను.

*                *                *

కామం, క్రోధం, భయం స్నేహంలేక ఐక్యభావంతో యేదో విధంగా భగవంతుడ్లో మనస్సు ప్రవేశింపజేసి సంసారంనుండి వదలి ప్రాణి భగవద్రూపు డగును.

కంసుడు భయంతో, శిశుపాలుడు ద్వేషంతో, కుబ్జ కామంతో శ్రీకృష్ణునిలో లీనమయిరి. స్తనములందు విషమును రాసుకొని పాలుద్రావించిగూడ పూతన కృత కృత్యురాలయ్యెను. జారబుద్ధితో కొంతమంది వ్రజాంగనలు పూర్ణతమ పురుషోత్తముని చింతించి ధన్యులైరి.

శ్రీకృష్ణుడు లౌకికమైన పతిపుత్రాదులవలె సావరణబ్రహ్మ లేక వివర్తిత బ్రహ్మగాదు. అతడు నిర్గుణ నిరావరణబ్రహ్మమె. గాన అతని అనుభవము అతని మనస్సుయొక్క ఆసక్తి అవశ్యముగా ముక్తికికారణములే.

శ్రీకృష్ణుడు నిరావరణ బ్రహ్మము. విషబుద్ధితో త్రాగిన అమృతం ఎట్లు అమృతత్వమును పొందించునో, అటులనే జారబుద్ధితో శత్రుబుద్ధితో గూడ నిరావరణ బ్రహ్మాత్మకమైన శ్రీకృష్ణుని భజన మోక్ష మొసంగును. వస్తుశక్తి జ్ఞానము నపేక్షింపదు.

చింతామణియందు దీపమనెడు బుద్ధివలన చింతామణికి లాభమే. అటులనే శ్రీకృష్ణునిలో జారబుద్ధి లేక శత్రుబుద్ధితో ప్రవర్తించిననూ ప్రవృత్తిగలవానికి శుద్ధ

బ్రహ్మయొక్క ప్రాప్తి లభించును. అక్కడ జారబుద్ధి గాని, శత్రుబుద్ధిగాని యుండదు.

*　　*　　*　　*

ముక్తులైన మునులు ఏ ఫలమును వెదుకుచూ, వెదుకుచూ అలసిపోవుచుందురో అదే దేవకినుండి ఫలించెను. యశోద దానిని పోషించెను, గోపికలు ఆ ఫలమును యథేచ్ఛగా భుజించిరి.

యశోదయొక్క మంగళమయమైన ఒడిలో నీల కమలముతో సమానముగా చిదానంద సరోవరంనుండి శ్యామ తేజము ప్రకటించెను.

ఆ ఫలాన్ని భృంగములు ఆఘ్రాణించలేదు. దాని సౌగంధ్యమును వాయువు ఎగురవేయలేదు. అది నీటిలో వుత్పన్నమైనది గాదు. తరంగముచే స్పర్శకానిది. ఇంత వరకు ఎవరును ఎప్పుడును జూడనిది.

*　　*　　*　　*

ఒకభక్తుడు ఉపనిషత్తు లనెడు వనములలో వెదకుచు వెదకుచు, అత్యంత ఖేదముక్తులైన వారు యీ వుపదేశమును వినుడు. ఉపనిషత్తులకు పరమతాత్పర్య

విషయమగు ప్రత్యేక చైతన్యాభిన్న పరబ్రహ్మ గోపికల యొక్క గృహములో రోటికికట్టి బంధింపబడి యున్నాడు.

మరొకభక్తు డంటాడు—

సఖి ! కౌతుకమైన మాట వినుము. శ్రీమన్నంద రాయునియొక్క ప్రాంగణంలో ధూళిధూసరితుడై వేదాంత సిద్ధాంతము థై థై మని నృత్యము జేయుచూ నాచేత జూడబడెను.

* * * *

హనుమాన్‌చాలీసా చూచారుకదా ! నిత్యము పఠించుచున్నారు. ఇది చాలాగొప్పది. తులసీదాసుగారు రచియించిరి. ప్రత్యక్ష ఫలదాయకము. సుందరకాండతో సమానమైనది. నిత్యముపఠించండి. నిత్యము పదునొకండు పర్యాయములు చదువండి. మంచిఫలితము. ఈయుపాధికి పక్షవాతరోగము వచ్చి నోరుపడిపోగా,దినమునకు నూట యెనిమిది పర్యాయములు చొప్పున నలుబది రోజులు పారాయణ(కళ్ళతోచూచుచు మానసికముగా)చేయగా వాక్కువచ్చింది. తరువాత మరి ఆరు మాసాలు పారాయణ చేసితిని. "యహశతవార పాఠకరజోయీ, ఛూటహి బింది మహా సుఖహోయీ" అన్ని బంధములు

వీడిపోయినవి-చూడండి ఏమిబంధములున్నవి (అన్నియు వీడిపోయినవి. ఏమిపోయినవి ? అన్నియుబంధములు పోయినవిగా! అని తమను తాము చూపించుకొనుచు) అన్నియు పోయినవి—నాయనా! కక్కచ గాచదువుము. మీరందరు చదువుడు. (శ్రీవారితో కలసి అందరు చాలీసా చదివిరి)

*　　　*　　　*

ప్రారబ్ధానుసారము ప్రాప్తించి వాటితో సంతోష మును సుఖమును ఎవడు కలిగియుండునో అట్టివానికే శ్రీరఘురాముని పాదపద్మములందు ప్రీతి జనించును. కదనము త్రొక్కినట్లు ఎవనిమనస్సు చాంచలసముగ తిరుగుతూ ఉండునో, భజనయందు కూర్చున్నపుడు గూడ మనస్సు చలించుచుండునో అట్టివాడు వనమురలో నున్నను, ఇంటిలోనున్నను వక్కటే. వానియొక్క బహిరంగ త్యాగమునకు మహాత్వ మేమిలేదు. విషయ రసమునందు ఉదాసీనుడై రాముని ప్రేమించవలయును. శ్రీరాఘువేంద్రుని వదలి అన్యవిషయములందు, విశ్వాస ముంచెదరో వారికి సుఖసంపదలు లేక పోగా నరకమున గూడా తావు దొరకదు.

*　　　*　　　*　　　*

## అవధూతవాణి

---

తపము, తీర్థాటనము, యాగము, దానము, నియమము, ఉపవాసము వీటిఅన్నిటికన్న మహాత్మ్యశాలి యగు (అధికమగు) శ్రీరామయని నామజప మొనరింపుము- అని తులసీదాసుగారు చెప్పు చున్నారు. నామమున గల రుచి ఏపదార్థమున లేదు. అమృతముకూడ దీని ముందు తీసికట్టు. గాన నిత్యము నామజపము చేయు చుండవలయును. సకుటుంబ నారాయణస్మరణలు.

---

ఈ గ్రంథముద్రణకు
ఈ క్రిందిభక్తులు సహాయము చేసిరి.

1. శ్రీ మున్నంగి వెంకటేశ్వరరావుగారు, తెనాలి. 50-00
2. డా॥ శ్రీ పి. సత్యకీర్తిగారు, గుంటూరు. 50-0
3. శ్రీ వుమ్మా మాణిక్యారావు (చంటి) గారు, ఏలూరు. 50-00
4. కీ. శే. వెల్లంకి దొరయ్యగారిజ్ఞాపకార్థము కుమారుడు, నల్లజర్ల. 100-00
5. శ్రీ శిరం కృష్ణమూర్తిగారు, ఖమ్మం. 30-00
6. ఒక భక్తురాలు, గుంటూరు. 25-00
7. శ్రీ వులిచి ఆదిశేషదాసులుగారు, గుంటూరు. 25-00
8. శ్రీ పి. వెంకటేశ్వరశర్మగారు, వుయ్యూరు. 16-00
9. శ్రీ మారుతీ రైస్‌మిల్లు, ఏలూరు. 11-00
10. శ్రీ బి. యస్. ప్రకాశరావుగారు, నర్సాపురం, 10-00

మా రాబోవు అవధూత గ్రంథములు. అపర చైతన్యులు, నామావతారులు, ప్రాతః స్మరణీయులు, బ్రహ్మీభూతులు అగు శ్రీ శ్రీ శ్రీ ప. ప. అవధూతేంద్ర సరస్వతీ స్వామివారు వ్రాసి కొనిన గ్రంథములను సేకరించి, మా మండలి ద్వారా ప్రకటించి సాధక భక్తలోకమునకు అందించ నిశ్చయించితిమి.

1. భగవన్నామ సంకీర్తన (క్రొత్తకూర్పు) 4.00
2. నామవందనము (మూలం తులసీదాసు) 1-50
3. హరినామమహిమ (పోతన) 0-50
4. అవధూతసూక్తులు 1-00
5. అవధూత లేఖలు
6. శ్రీకృష్ణ–ఉద్ధవ సంవాదం
7. గోపికా గీత (విశేషార్థము)
8. నిత్య పఠన స్తోత్రములు
9. శ్రీ స్వామివారు - అరుణాచలము
10. శ్రీ స్వామివారు - సప్తాహములు
11. భగవన్నామ మహిమ (వేదశాస్త్ర పురాణముల నుండి)
12. శ్రీ స్వామివారి జీవిత చరిత్ర
13. అవధూత పలుకులు
14. అవధూత సూక్తులు, ద్వితీయ భాగము

**సాధన గ్రంథమండలి, తెనాలి.**